

"ఊరికి వుపకారి" లో చలం, ఆరతి

భీష్ముని దక్షత, ద్రోణుని శిక్షణ, భారత వీరులను తీర్చి దిద్దిన వైనం, కౌరవ పాండవుల బాల్యాన్ని కమనీయంగా కథనం చేసే చలన చిత్ర ప్రబంధం.



వీనస్ మహీజా పిక్చర్స్



# బాలభారతము

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత సి.హెచ్. ప్రకాశరావు, దర్శకత్వం కె. కామేశ్వర రావు బి.ఎ., సంగీతం యస్. రాజేశ్వర రావు

Kalamandir

VEEKAY

నవయుగ

వాస్తవిక విషయాన్ని యథాతథంగా చిత్రించడం గాని, ప్రచురించడం గాని దోషంకాదు.

మావాళ్ళలో అన్ని కులాలలోను గొప్పవారు ఉన్నారు. బీదవారు వున్నారు. ప్రభుత్వంవారు, ఏ కులానికి సంబంధించిన వారయినా సరే పేదవారిని ఉద్ధరించడానికి ప్రయత్నించాలి గాని, కేవలం కొన్ని ప్రత్యేక జాతులపై తమ పక్షపాతవైఖరిని ప్రదర్శించడం అనుచితం. అన్యాయం కూడాను.

అయినా మీరు ప్రచురించిన కార్టూను నేడు హరిజనులు సాధించిన పురోభివృద్ధిని, ప్రభుత్వం అందుకై ఒసగుచున్న అవకాశాలను స్పష్టం చేయుచున్నదే గాని, ప్రత్యేకించి ఒకరిని నిందించుట అన్న భావం అందులో ప్రస్ఫుటం కావడం లేదు. మరి శ్రీ టి. యాదయ్యగారు విచారించుచున్న హరిజనుల పురోభివృద్ధి చూశా! లేక మా కార్టూను చూశా? అని సందేహంగా వుంది.

జి. ఎస్. ఆర్. నాయుడు, (అయిదాం)

## సీరియల్

'అనగనగా ఒక తండ్రి' ఈ సీరియల్ బావుంది. ఇందు రామ్మూర్తి పాత్రను చక్కగా చిత్రీకరించారు. తండ్రిగా అతడు పడుతున్న కష్టాలను చదువుతుంటే 'పరవాడికైనా ఒద్దు భగవంతుడా' అనే విషయం జ్ఞప్తికి వస్తోంది. ప్రసాద్ తండ్రికి చెప్పకుండా రిజిష్టరు మేరేజి చేసుకోవటం ఎంతైనా బాధాకరమైన విషయమనుటలో అతిశయోక్తి లేదనుకొంటాము.

కె. నాగఉమామహేశ్వరి, కె. సౌభాగ్యలత, (విజయవాడ)

## సినిమాలు - జాతీయ గీతము

నేడు సినిమా హాలునందు ప్రతి ఆట చివరన జాతీయజెండా స్లయిడు వేస్తూ, జాతీయ గీతము

# ఉత్తరాలు

యొక్క రికార్డు వేయుచున్నారు. కాని అటు జరుగునపుడు చాలా మంది ప్రేక్షకులు నిలబడకుండా వెళ్లిపోవుట పరిపాటి అయినది. చదువులేని వారేగాక చదువుకున్నవారుకూడా వెళ్ళుచున్నారు. కొన్ని సందర్భములలో గవర్నమెంటు ఉద్యోగస్తులు కూడా వెళ్లచున్నారు.

అందువలన సినిమా పరిశ్రమ వారిని యిందు మూలముగా కోరునది ఏమనగా:—

ప్రతి సినిమా చివరిలో (అనగా అదే ఆట) అంతమున జాతీయ జెండా ఎగుర వేసి ఆ జెండా ముందు ఆ సినిమాలో పాల్గొన్న నటి, నటులు, దర్శకుడు నిర్మాతలు, మొదలగు ఇతర సాంకేతిక బృందము నిలబడి జాతీయ గీతము పాడునటుల అదిగూడా సినిమాలోని భాగముగా ఏర్పాటు చేయవలెను. అట్లు చేసినచో, కొంతకాలమునకు కాకపోయినను మరికొంత కాలమునకు అయినను ప్రేక్షకులలో మార్పు వచ్చి జాతీయ గీతము వేయునపుడు హాలునందు నిలబడగలరని ఆశించవచ్చును. అందువలన వారికి జాతీయ జెండా జాతీయగీతమును గౌరవించుట తెలియ గలదు.

కాని యిందు మూలమున ముడి ఫిలిమ్సు ఖర్చు ఎక్కువ కాగలదని భావించవచ్చు. అందువలన సినిమాలోని ఒక పాటనైనను తగ్గించి పై సలహాను పాటించవలసినదిగా కోరుచున్నాను. జాతీయ గీతము అయిపోయిన తరువాతనే శుభం సమాప్తం, వగైరాలు వేయవలసినదిగా కోరుచున్నాను.

నెరెళ్ల మోహనరావు, (చీరాల)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)

శుక్రవారం : 1-12-72
శ్రీపరీధావినామ సం॥ కార్తీక మాసం॥ బ॥ ఏకాదశి.
సంపుటము : 66 సంచిక : 12

స్థాపితం : 1908
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1
విడి ప్రతి వెల 50 పైసలు


## విషయానుక్రమణిక

ముఖచిత్రం : నటి లీనా చందావర్కర్, ఫోటో : (శ్రీ వి. ఎం. కె. వాణి)




పైవారమే ప్రారంభం!
డుంబు చెప్పిన కథ
కథ అడ్డం తిరిగింది
బొమ్మల సీరియల్
రచన : బుజ్జాయి



నినాదాలు
నినాదాలు వినివిని విసుగు పుట్టింది. నాక్కావల్సింది తిండి.




పార్లమెంటులో వ్యవసాయమంత్రి ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్ పై విసుర్లు




గడియారం వెనక్కి త్రిప్పటం
ముల్కీ నిబంధనలు




ఉష్ట్రపక్షి తంతు
అధిక ధరలు
బ్యాంక్
ఆశాభావం

# హైదరాబాద్ నోట్ బుక్

## తిరుమల రామచంద్ర

### రెండు పండుగలు

దీపావళి, రమ్‌జాన్ ఈసారి దగ్గరగా వచ్చి జంటనగరాలకు మరింతగా శోభ చేకూర్చాయి. నెలరోజుల పవిత్రమయిన ఉపవాసానంతరం పారణతో సమాప్తమయ్యే రమ్‌జాన్ దీపావళితో పోటీ పడిందా అన్నట్టు దీపమాలికలతో నగరాన్ని దేదీప్యమానం చేశాయి. ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు తమ ఈద్ సందేశంలో అన్నట్టు తోడివారిపట్ల ప్రేమ, దయ, సౌభ్రాత్రం అన్నవి ప్రతిమతమూ చెప్పే ఆత్మగుణాలు. దీపావళి, రమ్‌జాన్ తమ దీపాల వెలుగులతో, ఇప్పటి తమోమయ పరిస్థితిని పటాపంచలు చేస్తే ఎంతో బాగుండునని ప్రతి సమైక్యవాదీ భావిస్తున్నాడు.

దీపావళి ప్రధానంగా చిన్నపంటల పండుగ; సంక్రాంతి తర్వాత కనుమునాడు పశువులను ఊరేగించినట్టు కార్తీకశుద్ధ పాడ్యమినాడు జంటనగరాలలో గేదెలను అలంకరించి ఊరేగించడమనే ఆచారం చాల ఆనందం కలిగించింది.

### శ్రీ అక్బర్ అలీఖాన్

అర్ధశతాబ్దికిపైగా దేశసేవ చేస్తున్న శ్రీ అక్బర్ అలీఖాన్‌ను ఉత్తరప్రదేశ్ గవర్నర్‌గా నియమించడం జంటనగరాలవారికి ఆనందకారణమైంది. శ్రీ ఖాన్ ప్రస్తుతం మైసూరు రాష్ట్రంలోచేరిన బిదర్‌జిల్లాలోని ఒక జాగీరుదారు వంశంవారు. 1920 నుంచే—అలీఘర్ విశ్వవిద్యాలయంలో బి. ఏ. చదువుతున్న నాటినుంచే—దేశసేవాపరాయణులు. గాంధీజీ సందేశం విని చదువుకు స్వస్తి చెప్పి సహాయనిరాకరణోద్యమంలో చేరారు. 'నేను చదువువదలిపెట్టి గాంధీజీ చేలా అయినది 1922 అక్టోబరు నెలలో. నన్ను గవర్నరుపదవి స్వీకరించమని కేంద్రప్రభుత్వం కోరింది 1972 అక్టోబరు నెలలో!' అన్నారు నాతో ఆయన. 'నిజంగా సంతోషకరమయిన కాకతాళీయం' అన్నాను. ఆయన 1923 లో ఉస్మానియా విశ్వవిద్యాలయంనుంచి వెలువడిన తొలి పట్టభద్రులలో ఒకరు. లండనువెళ్లి బారిస్టరయారు. ఏ పదవీ ఆశించకుండా కాంగ్రెస్ సేవ చేశారు. 1954 లో రాజ్యసభ సభ్యులుగా ఎన్నికయారు, 18 సంవత్సరాలపాటు ఆ సభ్యత్వం నిర్వహించారు. ఆ సమయంలో పెక్కు సెలెక్ట్ కమిటీలలో ఉంటూ సేవ చేశారు ఆంధ్రప్రదేశ్ సమగ్రత, సమైక్యం చెక్కుచెదరరాదనే గట్టి నమ్మకం కలవారు. కాని, ఎవరికీ అన్యాయం జరుగరాదనీ గట్టిగా అన్నారు. 'మీకు మీర్ అనే బిరుదు ఉండాలే. మరి ఎందుకు తొలగించారు?' అన్నారు. 'అరే, మియా, నవాబులు, మహారాజాలు పోయారు. మీర్ నిలుస్తాడా? నేనే తీసివేసుకొన్నాను కాలానుగుణంగా. అక్బర్ అలీఖాన్‌ను సంక్షేపించి అక్బర్ అని మాత్రం పెట్టుకోదలచాను' అన్నారు. 'మీతో, ఆంధ్రప్రదేశ్‌నుంచి వచ్చిన గవర్నర్ల సంఖ్య తొమ్మిదికి పెరిగింది.' అన్నాను. 'హహ్హహ్హ! ఆంధ్రప్రదేశ్ మహామహానాయకులనే కన్నది. నాబోటు చిన్నవారు ఇంక ఎందరో!' అన్నారు, వినయంగా.

ప్రసన్నమయిన ముఖకవళిక, బక్కపలచని పొట్టితనాన్ని కప్పిపుచ్చే సౌజన్యసంపద, 73 సంవత్సరాల వయస్సయినా, క్రమశిక్షణ ఉట్టిపడే చురుకు నడక, నవ్వుతూ మాట్లాడే ఆవర్జన శక్తి—వీటన్నిటితో శ్రీ అక్బర్ అలీఖాన్ తన మునుపటి తెలుగు గవర్నర్లలాగే ఉత్తరప్రదేశ్ ప్రజలకు అభిమాన పాత్రులవుతారనే నమ్మకం నాకు ఉంది.

### సినీతారల రాత్రి

క్షామ నివారణ నిధికోసం, నవంబర్ 2 వ తేదీన లాల్‌బహదూర్ స్టేడియంలో జరిగిన సినీతారల రాత్రి—దాదాపు రెండు లక్షల రూపాయలు సేకరించింది. ఈ వినోద కార్యక్రమానికి రవాణాశాఖా మంత్రి శ్రీ కె. ప్రభాకరరెడ్డి అధ్యక్షత వహించారు. శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ప్రారంభోత్సవం జరిపారు. దేశానికి ఆపదలు సంభవించినప్పుడు సినీతారలు, సినిమా పరిశ్రమ యజమానులు, కార్యకర్తలు చేసిన సేవను వివరించారు. ప్రస్తుత రాజకీయ దుస్థితి తొలగిపోయి తెలుగు ఫిలిం పరిశ్రమ హైదరాబాదులో నూతన జీవితం ప్రారంభించగలదనే విశ్వాసం ప్రకటించారు, ఆయన. ఈ కార్యక్రమం సమావేశకర్త శ్రీ కృష్ణ కార్యక్రమం ఉద్దేశాలు వివరించగా, శ్రీమతి విజయనిర్మల బహుమతులు పంచిపెట్టారు, శ్రీమతులు సావిత్రి, అంజలీదేవి, జమున. శ్రీయుతులు రావి కొండలరావు, పద్మనాభం, అల్లు రామలింగయ్య మొదలయిన ప్రముఖ నటీనటులు, నేపథ్యగాయనీగాయనులు శ్రీమతి పి. లీల, శ్రీ ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం ఈ సాంస్కృతిక వినోద కార్యక్రమంలో పాల్గొన్నారు. డాక్టర్ సి. నారాయణరెడ్డి తమ సహజ చతురకవితా కమనీయ వ్యాఖ్యతో ఈ సాంస్కృతిక కార్యక్రమం నిర్వహించారు. స్టేడియం జనంతో నిండి, మరొక హుసేన్‌సాగర్ నగర మధ్యంలో వెలిసిందా—అన్న భ్రాంతి కలిగించిది.

### ఉజ్జయిని సభ—

ఉజ్జయినిలో అక్టోబర్ 26, 27, 28 తేదీలలో జరిగిన ఓరియంటల్ కాన్ఫరెన్సుకు, పండిత పరిషత్తుకు ఒక విశిష్టత వుంది. ఇది నిరుడే జరుగవలసింది. కాని, బంగ్లాదేశ్ యుద్ధంవల్ల వాయిదాపడింది. విక్రమ్ విశ్వ విద్యాలయంలో జరిగిన ఈ మహాసభలో దాదాపు 1200 మంది విద్వాంసులు పాల్గొని తమ పరిశోధన వ్యాసాలు చదివారు,

జంటనగరాలనుంచి ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృత శాఖ రీడరు డాక్టరు పి. జి. లాలే— పురాణ గాథల పరిణామం, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి—సంస్కృత చారిత్రక కావ్యాలలో బిల్హణుని విక్రమాంక దేవ చరిత్రస్థానం గురించి ప్రసంగించారు. ప్రొఫెసర్ డాక్టర్ బి. రామరాజు—మధుర వాణి రామాయణ సారటీక, కుమారి పి. అరుంధతి—క్రీస్తు శకం 1000 నుంచి ఆంధ్రప్రదేశ్‌లో దేవాలయాల, మఠాల నిర్వహణ, నేను (తిరుమల రామచంద్ర)—పురుహూత, పురందర శబ్దవిచారం గురించి పరిశోధన వ్యాసాలు అందచేశాము. పూర్వం పురాలు లేవని, పురమంటే అస్సిరియా భాషలో నీరులో మునిగిన వ్యవసాయపు చెక్కలకు పేరుగనుక. సంచార జాతి నాయకుడయిన పురందరుడు ఆ చెక్కలను ధ్వంసం చేసి వుంటాడని, ఈ పోరు వేయి సంవత్సరాలు జరిగినట్లు ఋగ్వేదం నుంచి తెలుస్తున్నదని నా వ్యాసంలో వివరించాను. శ్రీ లక్ష్మణశాస్త్రి సంస్కృతంలో ప్రసంగించి, విక్రమాంక దేవచరిత్ర ఆకాలపు చరిత్రకు ఎలా అద్దం పట్టినట్లుందో వివరించారు.

ఆంధ్ర పదేశ్ నుంచి—శ్రీయుతులు ఎస్. శ్రీరాములు—ఉండి, డాక్టర్ పి. శ్రీరామ మూర్తి—ఆంధ్ర విశ్వ విద్యాలయం, ఏక్కిరాల అనంతకృష్ణ — ఆంధ్ర విశ్వ విద్యాలయం, డాక్టర్ గూడ సుందరరామయ్య ఆర్థికశాఖ, ఆంధ్ర విశ్వ విద్యాలయం, అయ్యగారి నరసింహమూర్తి—లయోలా కాలేజి విజయవాడ, డాక్టర్ ఎం. వెన్నారెడ్డి, డాక్టర్ కె. వరదచారి, ఇ. ఆర్. శ్రీకృష్ణ శర్మ—తిరుపతి, డాక్టర్ గంధం అప్పారావు డాక్టర్ ముదుంబై నరసింహాచార్యులు, కె. కె. ఎ. వెంకటాచారి—మద్రాసు తమ పరిశోధన వ్యాసాలు చదివారు.

మూడునాళ్ళూ సాయంకాలం మాలవ జానపద నృత్యనాటకాలు పండితులకు విజ్ఞానవినోదాలు కలిగించాయి. ఈ మహా సభను విక్రమ్ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ డాక్టర్ శివ్‌మంగల్ సింహసుమన్ ప్రారంభోత్సవం జరిపారు. ప్రముఖ చారిత్రకుడు డాక్టర్ డి. సి. సర్కార్ అధ్యక్షత వహించారు. స్థానిక కార్యదర్శి శ్రీ వి. వేంకటాచలం ఏర్పాట్లు చక్కగా జరిపించారు.

**ఉపశ్రుతి**

ఇద్దరు వాదించుకుంటున్నారు, వీధిలో. 'తగ్గవోయ్' అన్నాడు ఒకపక్షంవాడు ఎదిరిని. 'పులి ఒక్కటయితే, దారులు ఒక్కటవుతాయా? తగ్గను' అన్నాడు అతడు. 'వింత చెప్పనా పులుసు చాపదోయ్!' అన్నాడు ప్రత్యర్థి. ఆంధ్ర, తెలంగాణా పట్నంపుల లాగుందే, అంటూ వెళ్ళారు చూస్తున్న జనం.




కొలనిలో రాయిపడితే అలలు కొలనంతా చెదురుతాయ్! కాపురంలో కష్టంవస్తే అందరికీ చెందుతుంది.

అందుకే తమ సమస్యను కన్న సంతానం ముందుంచారు— "బడి పంతులు" రాఘవరావు దంపతులు. కొడుకు లిద్దరి చదువుల కోసం అప్పులుచేశారు. అది తీరకముందే కూతురి పెళ్లికి మరిన్ని అప్పులు చెయ్యవలసివచ్చింది. చివరికి అప్పులవాళ్లు ఇల్లు వేలం వేస్తామని నోటీసిచ్చారు. అప్పటికి రాఘవరావు పుణ్యాన బిడ్డ లిద్దరూ కాస్తో కూస్తో సంపాయిస్తూనే ఉన్నారు.

రాఘవరావుకు ఒక్కసారి ఆ అప్పు తీర్చే తాహతులేక, కనీసం కన్నవారైనా యింటిని నిలపకపోతారా అనే ఆశతో వారిని పిలిపించాడు కాని జరిగిందేమిటి? ఎవరికి వారే ఏవో సాకులు చెప్పి తప్పుకున్నారు.

మధ్యతరగతి కుటుంబాల్లో సర్వసహజమైన ఆర్థిక విధానాల్ని ఇంత చక్కటి పంథాలో చిత్రించారు త్రివేణివారి "బడిపంతులు" చిత్రంలో.

బడిపంతులు రాఘవరావుగా పద్మశ్రీ యన్. టి. రామారావు ఆయన భార్య జానకమ్మగా అంజలీదేవి. ఆయన సంతానం రామకృష్ణ, కృష్ణంరాజు, పద్మిని, అల్లుడు పిచ్చయ్యగా రాజబాబు, కోడలు శాంతగా జయంతి నటించారు.

త్రివేణి ప్రొడక్షన్సు **బడిపంతులు** నిర్మాత: పి. పేర్రాజు దర్శకత్వం: పి. చంద్రశేఖరరెడ్డి బి.ఎ.

TRIKE-31

# ప్రాథమికహక్కులని సవరించే దెవరు?

దేశంలోని ఉన్నత న్యాయస్థానం అయిన సుప్రీమ్‌కోర్టు ముల్కీ నిబంధనలు చెల్లుతాయని తీర్పు యిచ్చింది. భారత రాజ్యాంగంలో ప్రస్తుతం ఉన్న అంశాలని బట్టి ఈ నిర్ణయం జరిగింది. దీనికి తిరుగు లేదు.

ఈ నిర్ణయంవల్ల ఆంధ్రప్రాంతంలో తీవ్రమైన అసంతృప్తి చెలరేగింది. ఇప్పుడది తారస్థాయిని అందుకున్నది.

ముల్కీనిబంధనలు ఉండకూడదని ఆంధ్ర ప్రాంతం ప్రజలు ఆందోళన చేస్తున్నారు. ముల్కీ నిబంధనలు రద్దు కావాలంటే పార్లమెంటు కొన్ని చర్యలు తీసుకోవాలి. రాజ్యాంగాన్ని సవరించే అధికారం పార్లమెంటుకే ఉంది. కాబట్టి అవని దాని వల్లనే అవుతుంది. పరిస్థితి చేజారిపోక ముందే రాష్ట్రరాజకీయనాయకులు, కేంద్రం తగిన చర్య తీసుకోవాల్సిన అవసరం ఏర్పడింది.

కేంద్రమంత్రి శ్రీ చవాన్ యిటీవల హైదరాబాదు వచ్చి వివిధవర్గాల నాయకులతో సమాలోచనలు జరిపి వెళ్లారు. తెలంగాణావారికి ఉన్న రక్షణలు ప్రపంచంలో ఇంకెవ్వరికీ లేవని ఆయన అన్నారట.

" మన రాష్ట్ర రాజకీయనాయకులు కొందరు ప్రధాని ఆహ్వానంపైనా, మరి కొందరు ఆహ్వానం లేకుండానే ఢిల్లీ వెళ్లారు. ఈ ఢిల్లీయాత్ర కేంద్రనాయకులతో సమస్యని చర్చించి సరైన పరిష్కారాన్ని కనుగొనటానికి అని అంటున్నారు. ఉభయ ప్రాంతాల వారూ ఒక పరిష్కారానికి రావాల్సిందని కేంద్రం అంటున్నది. ప్రధానిమాత్రం ఈ విషయంలో తాము స్వయంగా జోక్యాన్ని కల్పించుకోమని అన్నారట. కానీ ఈ సమస్య ఎంతమాత్రం జాప్యం కాకుండా పరిష్కరింపబడాలని ప్రధాని అంటున్నారట.

రాష్ట్ర రాజకీయనాయకులు తమ తమ ప్రాంతాల ప్రజల అభిప్రాయం ఎలా ఉందో అలా తమ నిర్ణయాలు తీసుకోవాల్సి ఉంటుంది. తమ స్వార్థం కోసం తమని ఎన్నుకున్న ప్రజల అభిప్రాయానికి వ్యతిరేకంగా నిర్ణయాలు తీసుకుంటే మొదటికే మోసం రాక తప్పదు.

ఇప్పుడు కొన్ని రాజకీయ వర్గాలలో జరుగుతున్న మంతనాలు, ఆలోచనలు పార్లమెంటులో తగిన చర్య తీసుకోడానికి సన్నాహాలా?

ముల్కీ సమస్యపై ఆంధ్ర, తెలంగాణా నాయకులు ఒక ఒప్పందానికి రావాలని ప్రధానమంత్రి కోరుతున్నారట. ఈ రెండు ప్రాంతాల మధ్య కొన్ని విషయాలలో రాజీ కుదిరినా పార్లమెంటు ఈ రాజీని గౌరవిస్తుందని హామీ ఏమిటి?

దేశంలోని ప్రతి పౌరునికీ రాజ్యాంగం కొన్ని ప్రాథమిక హక్కుల్ని ప్రసాదించింది. దేశంలో ఎవరైనా ఎక్కడైనా నివసించ వచ్చు, ఎక్కడైనా ఉద్యోగ వ్యాపారాలని నిర్వహించ వచ్చు. ఈ ముల్కీ నిబంధనలు అలాంటి ప్రాథమిక హక్కులు కొన్నింటికి విరుద్ధం. వాటిని కొనసాగించ డానికి రాజకీయ నాయకులు ఎవరు?

రాజకీయ నాయకులు తాము ప్రజా ప్రతినిధులమన్న మాటని విస్మరించకూడదు. ప్రజల ఉద్దేశాలని, కోరికలని వారు గౌరవించి వాటిని అనుసరించి తాము నిర్ణయాలు తీసుకోవాల్సి ఉంటుంది. ప్రజల యిష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా తమ కేదో లాభిస్తుందనే ఉద్దేశంతో వారు నిర్ణయాలు తీసుకుంటే వాటిని ప్రజలు ఆమోదించరు. కాబట్టి ఏ ప్రాంతం నాయకులైనా వారి వారి ప్రాంతాలలోని ప్రజల ఉద్దేశాలు తెలుసుకుని వాటిని అనుసరించి వ్యవహరించాల్సి ఉంటుంది.

ప్రస్తుతం ఏర్పడిన ఈ సమస్యకి ప్రజాభిప్రాయమే సరైన పరిష్కారం అనవచ్చు. కాబట్టి ప్రజాభిప్రాయ సేకరణ జరిపి, దాన్ని అనుసరించి తగిన నిర్ణయాలు తీసుకుంటే అవి ఏ ప్రాంతం వారికీ అసంతృప్తిని కలిగించవు.

—ఎం. ఎం. రావ్



కేంద్ర విచారణ కార్యాలయం (సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్) జాయింట్ డైరెక్టరు శ్రీ ఎస్. వేణుగోపాలరావు ఐ. పి. ఎస్., గారికి ప్రధానమంత్రి శ్రీమతి గాంధీ బంగారు పతకం ఇస్తున్న దృశ్యం.

# ఆమె పువ్వులలో మల్లెపూవు!

మల్లెపువ్వు పూలరాణి. ఈ అందాల వనిత యవ్వనోద్యానవనంలో వికసించి మల్లియలాగా అందాల రాణిగా తయారైంది. ఆమె తన లావణ్యం మొగ్గవలె వికసించటం మాని మురిసి పోతోంది. ఈ అందాన్ని శాశ్వతంగా నిలుపుకొనుటకు, ఆమె ప్రతిరోజు జై సౌందర్య సబ్బును వాడుతుంది. జై సబ్బు మల్లెల సువాసనతో చర్మాన్ని మృదువుగా మెరుపుతో ఉంచుతుంది. అది అందరికీ ఆనందం కల్గిస్తుంది. మల్లెవాసన ప్రతివారినీ ఆకర్షిస్తుంది.




**జై**

సౌందర్య సబ్బు
మల్లెపూల వాసనతో

**టాటా ఉత్పత్తి**

OBM-7002 TL

## కరువుబాధితుల సహాయనిధికై

# సినీకళాకారుల యాత్రవిశేషాలు

—మోహన్ కుమార్

'మన ప్రాంతాలలో కరువుకు గురి అయినవారికి శక్తివంచనలేకుండా మనం కూడా తోడ్పడితే బావుంటుందేమో! మన సినిమాలు చూసి మనను పోషిస్తున్న ప్రజానీకం ఇబ్బందుల్లో ఉన్నపుడు ఆదుకోవలసిన బాధ్యత మన సినిమా పరిశ్రమ మీద ఉన్నది. ఇందుకు అవసరమైన పటిష్ట కార్యక్రమం ఒకటి రూపొందించా లనుకుంటున్నాను. మీ అభిప్రాయం ఏమిటి?' అని అడిగారు కృష్ణ ఒక రోజు—నన్నూ, తన తమ్ముడూ శ్రీ పద్మాలయా మూవీస్ నిర్మాత అయిన శ్రీ జి. ఆదిశేషగిరిరావునూ.

సాటివారికోసం పాటు పడాలన్న అతని సంకల్పం గొప్పది. ఎపుడూ బిజీగా ఉండే ఒక ఆర్టిస్టు యిటువంటి ప్రయత్నానికి ముందుకు రావటం మెచ్చుకో దగిన సంగతి. అతని అభిప్రాయాన్ని మేము బలపరిచాం. ఆ మూడోరోజునో, నాలుగో రోజునో అనుకుంటాను — ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ పి. వి. నరసింహారావు మద్రాసు వచ్చారు. అపుడు కృష్ణ ఆయన దగ్గర అప్పాయింట్‌మెంటు తీసుకుని తన అభిప్రాయాన్ని వెల్లడి చేశారు. అందుకు ముఖ్యమంత్రి తమ హర్షామోదాలు తెలుపుతూ 'యువతరం ఇంత ఉత్సాహంతో ముందుకు రావటం అభినందనీయం. మీ ప్రయత్నానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అండగా ఉంటుంది' అని హామీ యిచ్చారు.

తర్వాత ఒకరోజు కృష్ణ తన సాటి కళాకారుల్నీ, నిర్మాతలనూ, దర్శకుల్నీ—స్థానిక మైలాపూర్‌లో గల న్యూ ఉడ్‌లాండ్స్ హోటల్లో సమావేశ పరిచారు. విషయం చెప్పారు. ఆనాడు సమావేశానికి హాజరయిన వారంతా తమ ఆమోదాన్ని తెలిపారు. అతని సాటి కళాకారులంతా అతనితో సహకరిస్తామని ప్రకటించారు.

'ఫిలింస్టార్స్ రాలీ ఫర్ డ్రాట్ రిలీఫ్ ఫండ్' అని యీ కార్యక్రమానికి పేరు పెట్టబడింది. దీనికి కృష్ణ కన్వీనరు—రవాణాశాఖ మంత్రి శ్రీ కె. ప్రభాకరరెడ్డి ఛైర్మన్‌గా ఉండటానికి నిర్ణయమైనది.



సినీకళాకారుల వినోదప్రదర్శనలో విజయవాడలో స్వాగతోపన్యాసం యిస్తున్న కృష్ణ.

విజయవాడ, తెనాలి, గుంటూరు రాజమండ్రి, హైదరాబాద్ పట్టణాలలో వినోద ప్రదర్శనలు యిచ్చి—తద్వారా వచ్చే ధనాన్ని కరువు బాధితులకు సమర్పించాలని నిర్ణయం తీసుకోబడింది. ఈ వినోద కార్యక్రమాలు ఆయా పట్టణాలలో వరుసగా అక్టోబరు 28, 29, 30, 31—నవంబరు 2న జరగాలి. టూర్‌కు వస్తున్న ఆర్టిస్టుల దగ్గర నుంచి ఆ డేట్స్ తీసుకున్నాం. వినోద కార్యక్రమాలు రూపొందించాము. ఈ సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణ యువదర్శకులు శ్రీ వి. చంద్రశేఖరరెడ్డికి, శ్రీ వి. రామచంద్రరావుకీ అప్పగించటం జరిగింది. వారిద్దరూ ఎంతో శ్రమ తీసుకుని—ప్రోగ్రాములో ఏమేమి అంశాలు ఉండాలో నిర్ణయం చేశారు. ఎంతో బిజీగా ఉండే ఆర్టిస్టులంతా నాటకం రిహార్సల్స్‌కి వచ్చి వెళ్ళి—రోజూ సాయంకాలం ఆరు తర్వాత రిహార్సల్స్‌కి వచ్చేవారు.



'పండంటికాపురం' శతదినోత్సవసభ విజయవాడ 'ఊర్వశి' థియేటర్లో జరిగినపుడు తీసిన చిత్రం.

నేను, కృష్ణ మరొక సోదరుడు శ్రీ హనుమంతరావు (పండంటి కాపురం నిర్మాత) ముందు ఏర్పాట్ల కోసం—ఒక వారం రోజులు ముందుగా విజయవాడ రావటం జరిగింది. కృష్ణ ఒకరోజు ముందుగా అంటే 27 వ తేదీ మెయిల్లో వచ్చారు. ఆరోజే పద్మశ్రీ యన్. టి. రామారావు కూడా వచ్చారు—జి. టి. లో. కృష్ణతో దర్శకులు శ్రీ పి. పుల్లయ్య, నటుడు శ్రీ బాలయ్య, డైరెక్టర్ శ్రీ పి. చంద్రశేఖరరెడ్డి, శ్రీమతి విజయనిర్మల వచ్చారు.

కృష్ణ, పుల్లయ్యగారు మేమంతా కలిసి కృష్ణాజిల్లా కలెక్టర్ శ్రీ జి. కుమారస్వామిరెడ్డిగారి బంగళాకు వెళ్లాము; శ్రీరామ్‌కుమార్ (యస్. పి.) కూడ అపుడే అక్కడికి వచ్చారు. వారిదువురితోను ఆ మర్నాడు జరుగబోయే కార్యక్రమాలకు కావలసిన ఏర్పాట్లు గురించీ, పోలీసు బందోబస్తు గురించీ చర్చించాము. ఆ తర్వాత శ్రీ చెరుకూరి పూర్ణచంద్రరావు (విజయా పిక్చర్స్) గారి గెస్టు హౌస్‌కి వెళ్లాం. అక్కడ యన్. టి. ఆర్. ఉన్నారు. పూర్ణచంద్రరావుగారు సాదరంగ ఆహ్వానించి యన్. టి. ఆర్ ఉన్న రూమ్ (ఏ సి.) లోకి తీసుకువెళ్లారు. రామారావు గార్ని పలుకరించి, వారితో ఆ మర్నాడు జరగబోయే కార్యక్రమాల గురించి వివరించాము. ఆ వినోద కార్యక్రమాలకి ఆయన ప్రారంభకులు. అక్కణ్ణుంచి గుంటూరు వెళ్లి—ఆ జిల్లా కలెక్టర్ శ్రీ కె. జయభారత్‌రెడ్డి, శ్రీ చంద్రశేఖర్ (యస్. పి.) గార్లతో—తెనాలి, గుంటూరుల్లో జరిగే ప్రదర్శనలు, ఏర్పాట్లు, పోలీస్ బందోబస్తు గురించి మాట్లాడి వచ్చారు కృష్ణ.

ఆరాత్రి పెద్దపెట్టున వర్షం పడింది. అలా రాత్రి తెల్లవార్లూ పడుతూనే ఉంది. 28 వ తేదీ వచ్చేసింది. ఉదయం మెయిల్లో మద్రాసునుంచి ఆర్టిస్టులంతా వచ్చారు. ఆర్టిస్టులంతా ఒకేచోట ఉండటం మంచిదని అందరికీ 'హోటల్ మనోరమ' లో గదులు ఏర్పాటు చేశాము. మిగిలిన ముఖ్య సాంకేతిక నిపుణులూ పెటర్, ప్రొవర్టీస్, కర్టెన్స్, పెట్, మేకప్ రామ్ గ్రుప్స్, రక్షణదళం, బోయస్, కొందరు నిర్మాతలు రెండు బస్సుల్లోను, 14 చిన్న కార్లలోను 27 వ తేదీ ఉదయం మద్రాసునుంచి బయలుదేరారు. వాళ్లమాత్రం ఇంకా చేర లేదు. వాళ్లకి 'హోటల్ నటరాజ్' లోను, తదితర గెస్టుహౌస్‌ల్లోను మకాం ఏర్పాటు చేశాం.

*　　*　　*

ఆ ఉదయం 9 గం॥లకి 'పండంటి కాపురం' నూరురోజుల పండగ ఊర్వశి థియేటర్లో జరిగింది. హోంశాఖామంత్రి



తిరుపురాధితుల సహాయనిధికి వేదిక మీద శ్రీమతి సావిత్రి, శ్రీ సుబ్రహ్మణ్యంగారు (పూర్ణాపిక్చర్స్ మేనేజరు)

శ్రీ పి. వి. కృష్ణమూర్తి నాయుడు శత దినోత్సవ సభకి అధ్యక్షత వహించారు. పద్మశ్రీ యన్. టి. రామారావు — చిత్రంలో పాల్గొన్న నటీనటులకు, సాంకేతిక నిపుణులకు జయప్రద పిక్చర్స్ తరపున షీల్డులను బహూకరించారు. ఆ సభలో యన్. టి. ఆర్. మాట్లాడుతూ నిర్మించిన 'కృష్ణ నిర్మించిన 'మోసగాళ్లకు మోసగాడు' చిత్రం చూశాను. ఆ చిత్రంలోని సాంకేతిక విలువలు హాలీవుడ్ చిత్రాలస్థాయికి మించి ఉన్నాయి. కృష్ణతో ఆ విషయం చెప్పి యిలాంటి ఉన్నత ప్రమాణాలతో కుటుంబ కథావస్తువుని ఎన్నుకుని మంచి చిత్రం తీయమని చెప్పాను. అనాటి నా సలహా ననుసరించి అతను యిపుడు 'పండంటి కాపురం' తీశాడు. అది అద్భుతమైన విజయాన్ని సాధించి ఈనాడు వంద రోజుల పండుగ చేసుకుంటున్నది. నేను సీతారామకల్యాణం చిత్రం తీసేటపుడు కృష్ణ నా దగ్గరికి మొదటిసారిగా వేషం కోసం వచ్చాడు. ఈ చిత్రంలో నీకు సరిపడే వేషాలు లేవు. అవకాశం ఉన్నపుడు తప్పకుండా యిస్తాను అన్నాను.

కృష్ణ చాలా మంచివాడు. అతనిలో పెద్దలయెడ వినయమూ, భక్తి, గౌరవాలు ఉన్నాయి. స్వయంకృషితో రాణించాడు అతను. నా దగ్గరికి వేషానికి వచ్చిన రోజున కృష్ణలో ఉన్న భక్తి, గౌరవం, వినయం యీనాటికీ ఉన్నాయి. పట్టుదలా, కృషి కృష్ణ సమర్థతను రుజువు చేశాయి' అన్నారు.

తన ఉపన్యాసంలో 'యన్. టి. ఆర్. గారంటే నాకెంతో గౌరవం. 'నేను ఆయన అభిమానిని. ఆయన నాకు మార్గదర్శకులు.

వారిచ్చిన సలహాలు పాటిస్తూనే, నేనింత వాణ్ణి అయ్యాను. మా కొత్త చిత్రంలో యన్. టి. ఆర్. గారికొక చక్కని వేషం ఉంది. వారు వేస్తానంటే ఆ చిత్రం తీస్తాను' అన్నారు, కృష్ణ.

సభంతా చప్పట్లతో మారుమ్రోగింది. పన్నెండున్నరకి 'పండంటి కాపురం' శతదినోత్సవ సభ ముగిసింది. ఆ మధ్యాహ్నం లంచ్ మా అందరికీ శ్రీ జి. కామరాజ్ (పూర్ణా పిక్చర్స్ అధినేత) ఫిలిమ్‌ఛాంబర్ బిల్డింగ్స్‌లో యిచ్చారు. భోజనాలు పూర్తి అయింతర్వాత హోటల్ మనోరమకు వచ్చి చేరుకున్నాం.

* * *

మధ్యాహ్నం రెండున్నర అయినా వర్షం యింకా అలా రాత్రినుంచీ కురుస్తూనే ఉంది.

నిన్నటి ఉదయం మద్రాసునుంచి బయలు దేరిన బస్సులూ, చిన్నకార్లూ యింకా విజయవాడ చేరుకోలేదు.

ఇంతలో కృష్ణ హడావిడిగా వచ్చి 'బస్సులూ, కార్లూ ఇంకా రాలేదు. అవి రాకపోతే ఈ ప్రోగ్రామ్స్ యివ్వటం ఎలా? సెట్, ప్రాపర్టీస్, మేకప్ డిపార్ట్‌మెంట్ అన్నీ వాటిలో ఉండిపోయాయి. ఏం చేద్దాం?' అన్నారు నాతోను, శ్రీ ఆదిశేషగిరిరావుతోను.


మూత్రము తరచుగా విసర్జిస్తున్నారా?

(Sat Sat Boo

“యూరిటోన్ బిళ్ళలు” ప్రాచీన కాలం నుండి ప్రఖ్యాతిచెందిన యునాని వైద్యవిధానంలో అపూర్వమైన వనమూలికలు, ఓషధులతోను, కషాయముల తోను శాస్త్రీయంగా తయారైన బిళ్ళలు— ఈ వ్యాధిని నిర్మూలించగలవు.

“యూరిటోన్” పొదుపైనది. నిరపాయమైనది. సులభంగా తీసికోవచ్చును. ప్రత్యేక ఆహారనియమాలు లేవు. సామాన్య ఆరోగ్యంకలవారుకూడా ఈ మందులో శక్తినిచ్చేగుణాముగలదు గాన, వాడవచ్చును. వివరముల కొరకుగా వ్రాయండి. ఉచితంగా పంపెదము.

ధర 40 బిళ్ళలుగల సీసా రు. 10 మాత్రమే. ప్యాకింగు అండ్ పోస్టేజి రు. 2 లు అదనం. ఒకేదఫా 2 లేక అంతకు ఎక్కువ సీసాలకు ఆర్డరు పంపువారికి పోస్టేజి ఉచితం.

BARRYS (HERBAL) LABORATORIES (P.M)
G.P.O. BOX NO. 107, Calcutta.


# సినీకళాకారుల...

నెల్లూరు — కావలి — ఒంగోలుల మధ్య వాగులు పొంగి రోడ్లన్నీ జలమయ మయ్యాయని వార్తలు. మా హోటల్‌కి సమీపంలో వున్న ఆర్. టి. సి. కి ఫోన్‌చేసి—నెల్లూరు వైపునుంచి మీ బస్సులు ఏమైనా వచ్చాయా? అని అడిగాం. పొద్దుటినుంచీ ఏ బస్సూ రాలేదు! ఒంటిగంటకు కావలినుంచి రావలసిన బస్సుకూడా రాలేదు! అన్నారు వాళ్ళు.

మా గుండెల్లో రాయి పడింది. కృష్ణ మొహంలో బాధ ద్యోతకం అవుతున్నది. సాటికళాకారు లందర్నీ కూడగట్టుకుని ఈ ఉద్యమానికి సారథ్యం వహిస్తున్న వ్యక్తి అతను. మెటీరియల్, కొందరు ముఖ్యసాంకేతికనిపుణులు బస్సుల్లో ఉండిపోయారు. ఆ బస్సులు యిక్కడకి చేరందే ప్రదర్శనలు ఎలా యివ్వటం అనేది అతని బాధ.

అంతకు ముందువరకూ మాతోనే వున్న మిత్రుడు శ్రీ రాజేంద్రప్రసాద్ (యస్. వి. కె. ఆర్.) వాళ్ళ పెట్రోలుబంకు (కృష్ణా బారేజి అవతల ఉంది) కి వెళ్ళారు. మే మీ సందిగ్ధంలో పడి ఏం చేద్దామనుకుంటుండగా బంకునుంచి రాజా ఫోన్‌చేశారు. 'మీ బస్సులు ఊళ్లోకి వస్తున్నాయి. ఒకటి యిప్పుడే మా బంకునుంచి కదిలింది!' అని...అమ్మయ్య! ప్రాణాలు తేలికపడ్డాయి. అందరి మొహాల్లోను ఆనందం వెల్లివిరిసింది.

అసలు ప్రదర్శనలు యిచ్చేస్థలం మునిసిపల్ స్టేడియం. వర్షాలమూలంగా స్టేడియం అంతా నీటిమడుగయింది. అందుచేత రెండు థియేటర్లలో రెండుసార్లు ప్రదర్శనలు యిచ్చేట్లు ఏర్పాట్లు చేశాము.

* *

కొంపెల్ల గోపాలకృష్ణమూర్తి నాకు స్నేహితుడు. అతను ఒకప్పుడు ఆంధ్ర (దిన) పత్రికలో సబ్‌ఎడిటర్‌గా పనిచేశాడు. ఇప్పుడు ఆలిండియా రేడియో విజయవాడ కేంద్రంలో ప్రోగ్రామ్స్ ఆఫీసర్‌గా ఉంటున్నాడు. అతను నా దగ్గరికి వచ్చి ఈ వినోద కార్యక్రమాలన్నిటినీ బ్రాడ్‌కాస్ట్ చెయ్యాలనుకుంటున్నామనీ, కృష్ణగారితో ఇంటర్వ్యూ కావాలనీ కోరాడు. ఇంటర్వ్యూ ఎరేంజ్ చేశాను. ఈ కార్యక్రమాల వెనుకగల తమ లక్ష్యాన్ని ఆ ఇంటర్వ్యూలో ప్రజలకి వివరించారు కృష్ణ.

ఏ. ఐ. ఆర్. వాళ్ళు ఆ సాయంత్రం ప్రదర్శనలను రికార్డు చేసుకునేందుకు లోపలికి రావటానికి కారుపాసులు, బాడ్జీలు యిచ్చిపంపించాను, గోపాలకృష్ణకి.

* * *

ప్రదర్శనలు మొదట అలంకార్ థియేటర్‌లో ప్రారంభమయ్యాయి. ప్రారంభకులు పద్మశ్రీ యన్. టి. రామారావు తమ ప్రారంభోపన్యాసంలో 'నా తర్వాత తరంవాడు కృష్ణ. ముందుతరం వాళ్ళకి వెనుకతరం వాళ్ళు స్వాగతం యివ్వాలి. వారిలోని మంచిని గ్రహించి ముందుకు నడిపించాలి. ఇదివరలో ఆంధ్రప్రదేశ్‌లో విపత్కర పరిస్థితులు ఏర్పడినపుడు నేను ముందుకుదూకి అనేకసార్లు యిటువంటి ఉద్యమాలు నిర్వహించిన సంగతి మీ అందరికీ తెలిసినదే! ఇప్పుడు సోదరుడు కృష్ణ, తన సాటి నటీనటులందరితోను కరువు బాధితుల సహాయనిధికి చేస్తున్న కృషికి నిరంతరం తోడ్పడి జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాను' అన్నారు.

ఈ వినోద ప్రదర్శనలు మొదట అలంకార్ థియేటర్‌లోను, ఆ తర్వాత ఊర్వశి థియేటర్‌లోను జరిగాయి. ఒక రిలీజ్ ప్రింటును రెండు థియేటర్లలో విడుదల చేస్తే ఎలా వుంటుందో అలా వుంది. అలంకార్‌లో ప్రోగ్రాం యిచ్చిన ఒక అయిటమ్ వాళ్ళు అక్కణ్ణించి హడావిడిగా ఊర్వశికి వెళ్లి ప్రదర్శన యిచ్చారు. ఇలా ఒక్కొక్క అయిటమ్ రెండేసిసార్లు రెండు విభిన్న స్థలాల్లో యివ్వటం జరిగింది.

విజయవాడలో కార్యక్రమాలు విజయవంతంగా ముగిశాయి. జిల్లా కలెక్టర్ శ్రీ కుమారస్వామిరెడ్డి విజయవాడలో ఈ ప్రదర్శనలకు అమ్మిన టిక్కెట్లమీద లక్ష రూపాయలు వసూలయినట్లు ప్రకటించారు.

ఆ రాత్రి మా యూనిట్ అందరికీ జయప్రద పిక్చర్స్ తరఫున నిర్మాత జి. హనుమంతరావు హోటల్ నటరాజ్‌లో డిన్నర్ యిచ్చారు. వర్షం ఇంకా మమ్మల్ని వదలలేదు. వెంటాడుతూనే ఉంది.

**(ముగింపు పైవారం)**

# మొగలి నాగు

"ఊర్వశి"

'సూరే! ఓ సూరీడా!' వయ్యారంగా పిలిచింది వద్దిమూటను విలాసంగా చేతులోకి మార్చుకుంటూ; సూరి ఇంటి ముందు నిలబడి రత్తి.

'ఓయి! వత్తన్నా! వత్తన్నా!' సమాధాన మిచ్చింది సూరి.

'యాందమ్మా! ఒదినా! సింగారం యింకా గాలేదా ఏంది? సేలో వన్లోకెల్టానికి ఇంకా టయాం కాలేదా ఏంది?' అంది రత్తి. అప్పటికే చంద్రి, చుక్కమ్మ, నాగి, ముత్తేలు కిలకిల నవ్వుకుంటూ చేరారక్కడికి.

'యాందమ్మా! ఏం జేస్తాంది యింకా ఇంటౌ?' ప్రశ్నించిందొక ధీరురాలు ఆలస్యాన్ని భరించలేక.

'యాందమ్మా! మొగుడ్నిడిసిపెట్టి రానే కుంది. ఓ సూరే!...' పిలిచింది ముత్తేలు.

'ఓయ్ వత్తన్న! వత్తన్న' అంటూ ఇవతల పడంది సూరి. తెల్లగా నున్నగా ఉండే పాలరాతి విగ్రహంలాంటి శరీరానికి. గులాబిపూరంగు కలనేత చీరను గోచీపోసి కట్టి, లేతాకు పచ్చరైక తొడిగి, చేతులకు నిండుగ, సోమవారం సంతనాడమ్మెచ్చిన గాజులు తొడిగి, కన్నులనిండుగ కాటుక పెట్టి, నుదుటి మధ్యన యాగాణీ అంత కుంకుమబొట్టుపెట్టి చంపసరాల మీదుగా జుత్తును సాదాగా వదిలి దువ్వి, సిగను మరింత లలితంగా చుట్టి, చీరకుచ్చిళ్ళ నొకసారి సవరించుకుంటూవచ్చిన సూరిని తీసికుని బయలుదేరింది బృందం. ఇక ఇకలమధ్య పకపకలమధ్య రంగురంగు పూల మధ్య రోజారాణీలా కదలిపోసాగింది సూరి.

'ఏందమ్మా ముత్తేలూ! రయికనింత గట్టిగ ముడేసినవు?' అంగి చుక్క ముత్యాలు రవిక వెనుక భాగాన్ని లాగుతూ.

'ఓలమ్మా! ఏందమ్మా సోజ్జం నీ రయిక అందం కన్నినా ఏందమ్మా? నీ పొట్టేడుంది? రయికేడుంది?' ఎత్తిపొడిచింది ముత్తేలు.

'ఒసే ముత్తేలూ! మీరు వల్లకోండే! అల్లా సినిమాలో అదేంది! దానిపేరే గురుతుందమ్మా! జయలల్తా, మరెవ్వరో గాని కోక బలే గట్టిందమ్మ! రయిక పెద్ద గుండెలమీదేనవ్వా!' అంది నాగి.

'అందుకే నవ్వా! ముగోళ్ళు సినిమాల వడిపడి సూత్తారు' కనిపెట్టిన రహస్యాన్ని ధైర్యంగా చెప్పింది చంద్రి.

'రయికలే ఉండవమ్మ కొన్ని సినిమాల్లో!'

'అల్లా సినిమాలో ఒకటె పాముసాగ బట్టలేసికోని డాన్సు ఏసింది గదా! ఓలమ్మా! సూత్తావుంటే యిసిత్తరం అనిపించినా దొడినా!'

'సినిమాల సంగతేందిగ్గాని. గట్టుమాట.

# మొగలినాగు

రాదూ. సూరి నడుస్తావుంటే మొగలినాగు నాగటయా?'

'ఏం దొదినా?'

'మొగలినాగే!'

'ఓలమ్మో! ఓలవ్వో! ఏదే! ఏదుంది?'

బృందం అంతా తుళుక్కుబడి కంగారు పడింది.

ఇకఇక లాడింది ముత్తేలు.

'ఏందా ఇగటాలు' కోప్పడిందొక జవ రాలు.

'మాట పూనాగా యినాపోతే నానేటిసేసే దొదినా? మన సూరినేదూ! నడుస్తా వుంటే మొగలినాగు నాగనేదూ!' అన్నా గంతే.'

తెల్లగా నాజూకైన శరీరంతో, మిల మిల మెరిసిపోయే నడుముతో, సున్నగా చేతిలోంచి జారిపోయే పాములాంటి శరీర అవయవాలతో, వక్షం ఒకమాదిరిగా, నడుము వేరేమాదిరిగా, పిరుదులు కాళ్ళూ మరోమాదిరిగా కదులుతూంటే, నడుస్తున్న సూరి నిజంగా మొగలినాగేమో అనిపించింది అందరికీ.

అందరికన్నా నాలుగడుగులు ముందేసి నడుస్తున్నదల్లా ఆగి ఏంటన్నట్టు చూసింది. ప్రక్కనున్న జవ్వని విషయ మంతా చెప్పింది.

'ఓలమ్మో! పాముకింద గట్టిగా! మీరంతా!' అంది సూరీడు. కనుబొమలు ముడిపడ్డాయి. కనురెప్పలక్రింద కాటుక అందంగా మెరిసింది.

'ఇగటాలకంటే ఇదేందవ్వా!'

'గంతేగదా!' అంది గుండెమీద చెయ్యేసి కుని. దీర్ఘంగా నిట్టూర్పు విడిచింది కోపంతోకూడిన మందహాసాన్ని విర జిమ్ముతూ. ముక్కున బులాకీ అందంగా కదిలింది. శరంకమ్మలు చెవులపై అందంగా జీరాడాయి.

'గుండెమీద చెయ్యి తీయొదినా?' అంది రత్తాలు.

'అమ్మయ్యో!' గుండెపైనుండి చేతిని యాంత్రికంగా ఒదిలేసింది. అంతవరకూ చేతిపిడికిటనున్న చీరచెరగు చేతితోపాటు జారిపోయింది.

ఉదయకాలపు సూర్యుని సిరెండలో ఆకు పచ్చని రవికనుండి ఆమె తెల్లని వక్షోజాలు మరింత శోభతో మెరిశాయి. వక్షోజాల అగ్రభాగాల పరివృత్తమైన వృత్తాలు, ఆ అగ్రభాగాలు, రెండుచేతుల్లో ఇమిడి పోయిన చక్రవాక పక్షుల ముక్కుల్లాగ కని పించసాగాయి. స్తనద్వయం మధ్యని అగాధం, సుఖానికి సుఖానికి మధ్య విషాదంలాగ చీకటితోనిండి, ఆమె ఊపిరి వదలినపుడు నల్లని మేఘాల ఒరిపిడికి మెరుపు జనించి నట్టు సిరెండలో తళుక్కుమని ఊదుతుంది. వక్షోజాల దిగువున వెన్నముకకంటే తెల్లని నడుము, ఆ నడుము మధ్య అందంగా గిరికీలుకొట్టే బొడ్డు, సూరి కొద్దిగావంగి పయ్యెదను సరిచేసుకునేటప్పుడు ముందుకు తొలగిన అరటి దూలాల్లాంటి తొడలు అచ్చెరువును కలిగించాయి రత్తాలుకి.

నలుగురు ముందుకునడిచేవరకూ ఆగి. సూరిని వెనక్కిలాగి, గబుక్కున నడుము చుట్టూ చెయ్యివేసి దగ్గరకు లాక్కుని బుగ్గను కటుక్కున కొరికేసింది రత్తాలు.

'ఏందే రత్తాలూ! నీవు ఆడదానివా? మగనాలివా?' అంది సూరి కోపంగా బుగ్గను తడుముకుంటూ.

రత్తాలు నవ్వుతూ 'నానే మగనాలినైతే ఈపాటికీదుందువా నీవు? ఆ దొంపలమద్దెకు లాక్కునిపోనా నిన్ను?'

'ఏందా ఇగటాలు' నిజంగా కోప్పడింది సూరి.

'నిజంగా నవ్వా! ఈమాట సెపుతా నివాలకించుమీ! నిన్ను సూసినాక ఏ మగాడైన పెదివ సప్పరించకపోతే నా పేరు రత్తాలే గాదు నామాట ఇనుకోని ఇగ నీవు పని లోకి రామాకు. ఏ ఎదవకళ్ళు పడ్డా... అసలే మగోళ్ళు మంచోళ్ళు కారు. ఆడ దాన్నిసూస్తే ఊట్లు నచ్చినట్టూగిపోతారు!' అంది రత్తాలు.

సూరికళ్ళలో భయం కదిలింది. పెదవులు వణికాయి. బుగ్గల్లో రక్తం నిలిచింది. అంతలోనే కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి.

'హూ!' దీర్ఘంగా కోపంతో నిట్టూర్చి 'అంత జరుగుతావుంటే సేతులు ముడుసు కోటానికి నానేమి అలకామణిసిని కాను. సేనాలు పోవాల్నేగాని లొంగుతమా ఏంది?' అంది సూరి.

'ఇగటాలకంటే అంత రోసమేందు కమ్మో వొదినా? మాము మాత్తరం మడా సులంగామా? సూత్తా ఊరకుంతమా? ఎవుడికీ అన్ని గుండెలు? సేనా లు ఇవ్వమా?' అంది రత్తాలు.

'ఏంది పడుసుపిల్లలూ! కతలు సెప్ప కోటానికి టయాం నేడుగాని పారండి. పారండి' కేకేసింది ముందు నడుస్తున్న పడుచుపిల్ల.

రత్తాలు, సూరి గబగబా అడుగులేసికుని



అందర్నీ కలిశారు. దూరంగా నీటితోనిండి, హొరుతో కలకలలాడుతున్న పొలాలు వాటి కనతిదూరంలో బారుగా నిల్చికున్న తాళ వృక్షాలు, వాటికి చాలదూరంగా నిల్చిన మనుష్షైన నీలపు కొండలు రోడ్డు కొక ప్రక్క నీటితోనిండిన కొమరయ్య చెరువు, ఉన్నాయి అప్పటికే దొలయ్య నలుగురు రైతుల్ని వెంటేసికుని, ఉనుపులు చేయించ టానికి, బురదగా ఉన్న నేలమీద నిలబడి చుట్ట ముట్టించి, గొడుగేసికుని తయారుగా ఉన్నాడు

మగాళ్ళని చూడగానే వాళ్ళలో ఇకిలింతలు, పకపకలు ఈసడింపులు మొదలైనాయి

ఒత్తుగ పెరిగిన మీసాల వర్ణించే
దొకర్తె!
వామనాకారాన్ని వలచే దొకర్తె!
ఎత్తుపళ్ళ నెద్దేవచేసే దొకర్తె!
గంటు ముఖం పై కవిత్వాన్ని చెప్పే
దింకోర్తె!

ఇలా రకరకాలుగా వ్యాఖ్యానాలు సాగిపో తున్నాయి వాళ్ళమీద

పొలం పన్లకి, ఆ ప్రాంతానికి రావటం క్రొత్తగావటంచేత అందరికన్నా వెనుక నడు స్తోంది సూరి సూరికితోడు రత్తాలు పెళ్ళికాని పిల్లయినా సాహసవంతురాలు రత్తాలు.

మాటాడటానికి ఏమీతోచని సూరికి, కొండడు అంతక్రితం రోజు సాయకాలం, దేవాలయం తోటలో పట్టిన మొగలినాగు గుర్తుకొచ్చింది భర్త రాత్రివేళ దాన్ని బుట్టలో పెట్టేటప్పుడు అది పెట్టిన అవస్థను కనులారచూచి నవ్వుకున్న సూరి పక్కున నవ్వింది ఆ దృశ్యాన్ని గుర్తుకు తెచ్చుకుని

'ఏంది? నవుతూండవు? ఏంది కతా?' అడిగింది రత్తాలు.

'నిన్న మాపిటేల ... ...' నవ్వునాపు కుంటూ కాసేపాగి మళ్లా అంది 'చివా లయం ఎనకతోటలోన మొగలినాగొకటి దొరికినాది మా ఆయనకి దాన్ని సూత్తా వుంటే నవొచ్చిరాదమ్మా! ఓ అమ్మా! ఎంత పొడవుండదనుకున్నావ్! తెల్లంగ మెరుస్తా కదుల్తా వుంటే అనుంటి సీర కట్టాలనిపించినాదమ్మ! ఓ పాలి నోరు కదిపి నాది గదా! నాలిక దీపం మంటనాగ అని పించినాదవ్వ! కోరలున్నయంట. కాన్తైతే






అమృతాంజన్
గ్రైప్ మిక్స్చర్
పాప ఆరోగ్యానికి,
సంతోషానికి దివ్యామృతం

అజీర్ణం, వాయువు,
కలతనిద్ర, వాంతులు,
విరేచనాలవంటి బాధలు
వెంటనే తగ్గిపోతాయి.
ఆకలి, జీర్ణశక్తి బాగా
ఉంటాయి.
పాపాయి ఆరోగ్యం
బాగుపడుతుంది.

అమృతాంజన్
లిమిటెడ్

FDS.AG 1660 TEL





"బరకగా ఉండే
పాత కాలపు
పళ్ల పొడులు
మీ చిగుళ్లకు పళ్లకు
చెరుపు చేస్తాయి..."

కాల్గేట్ టూత్ పౌడరుతో
మీ చిగుళ్లను, పళ్లను
కాపాడుకోండి. చెడు
శ్వాసను అరికట్టండి!

కాల్గేట్ టూత్ పౌడరుతో అధునాతన దంత సంరక్షణ పొందు పైనది— దాని ఉల్లాసకరమైన రుచిని మీరు ఎంతో మెచ్చుకుంటారు! మీ కుటుంబం కోసం ఈ రోజే ఒక డబ్బా కొనండి!

మావ తీయడంట. పాపమంట. కాన్నైతే మామనేటి సెయ్యదులే నాన్నైతే ఆశాయ లకు బోను. ఎల్లినా నన్నేటి సెయ్యదంట. వేరు మొలకి కట్టినాడులే మావ' అంది సూరి.

'ఏందోనమ్మా! పాములు మాసెడ్డ జంతూలు నమ్మగూడదవ్వా ఆట్ని మి మావ పాములాడేగాని జాగరత్తగా ఉండాల్న. సూసి సూసి కటేత్తయి'

'నా బయంగూడ గదే రత్తాలు. కాని మావ కదంతా ఇగటాలే. 'నాను బయ పడితే పాములపట్టే దెవుడు? పాంమంతరం ఏసేదెవుడు? సూడంగా ఊరంతా పూరి గుడిసెల మయమేనాయె ఏమూల నక్కి ఒక్క కాటేత్తె దిక్కెవుడు? నాదుడెవుడు? బలే! సూరే! నాయమంతడికి దరమ వంతుడికి ఇయ్యేటి సెయ్యవే. అయినా బెమ్మగీత వద్దంటే తప్పద్దా!' అంటడు

'నిజమేలేనవ్వా! నాగమయ్య రచ్చించు అని సవితినాడు పుట్టలో పాలుపోస్తుండం గదా! ఆ నాగమయ్యే సూడాల సల్లగ'

పొలాన్ని సమీపించేసరికి వాళ్ళ సంభాషణ ఆగిపోయింది అందరూ ఒకరి వెను కొకరు గుంపుగా నిలబడి, పొలం ప్రక్క నాగి పోయారు.

'ఏందే! ముక్కా! ఎంతమందొచ్చినారు. ఏలదికల?' అడిగాడు దాలయ్య

'ఒచ్చినమయ్యా! నాను, సెంద్రి, రత్తాలు, నాగి, ముత్తెం.'

# వెంగలి నాగు

'ముత్యాలూ, పగడాలూ కాదే. లెక్క కావాలి నాకు లెక్క' తువుక్కున ఉమ్మేసి అన్నాడు దాలయ్య.

'సెప్తన్నగదా! ఒకటి.. రెండు మూడు ఆరు ... పదివన్నెండు దొరా!' అంది ముక్క

'పన్నెండు గురా! పరె ఊళ్ళంతా రేపూ వస్తారా? ఎవరే అది? కొత్తపిల్ల నాగుంది' అన్నాడు దాలయ్య సూరివంక చూసి.

'ఎవరైతే నికేం దొర నీకు పని గావాల మాము పని సెయ్యాలి గంతే గదా!' అంది రత్తాలు

'ఒసొస్సి! ఏటే రోసం! ఏటన్నారని! కొత్తపిల్లనాగుంది అన్నా గంతె గదా! సర్నెండి లెగే సుక్కా! లెగండొసే లెగండి సడూలు వంచండి మాపటేల కిదంతా అయిపోవాల' అన్నాడు దాలయ్య.

అందరూ నవ్వుకుంటూ ఉనుపులకు గిగారు కోకలెగ్గట్టి

ఎగ్గట్టిన కోకల దిగువున మిలమిల మెరిసే పిక్కలను, తొడలను చూస్తూ నోరు చప్పరిస్తూ 'కాసింత పైకెగ్గట్టే వోక బురదై పోగల్దు మాపిటేలకు ఊపు ఇమానం మోతే' అంటూ సీతికి ఆజ్ఞ జారీ చేసాడు

దీపం చుట్టూ పురుగులా తిరిగే దాల య్యను చూసిన తరువాత అసహ్యం కలి గింది సూరికి. తొడలమీదికి పూర్తిగా కోకను లాక్కుంది సూరి. సూరి చర్యను చూసి కొత్త కాబట్టి ఏమి అనలేక పోయాడు దాలయ్య.

యజమాని ఆజ్ఞలో నిజం కనబడో, లేక ఆజ్ఞను పాలించటమే తన విధి అను కనో, లెక మరే కారణం చేతనో కోకను మరింత పైకి ఎగ్గట్టి, పూర్ణకుంభాల మధ్యకు చీర చెరగును లాక్కుని, నడుము చుట్టూ తిప్పి బొడ్లో దోపుకుని 'హూ!' అని మూలిగి, మూతిని మూడువంకర్లు తిప్పి పనిలోకి జారబడింది సీతి

రత్తాలు పక్కనే వంగుని చేసుకుపోతుంది సూరి

ఇద్దరు మొగాళ్ళు చేనుకటు ఇటు నిల బడి పనిచేయిస్తున్నారు. అంతా కుర జట్టు కావడంచేత పని చకచక సాగి పోతోంది ఉనుపుల పదాలు జోరుగా సాగు తున్నాయి.

ఇంపైన తొడలముందు, బలమైన పిక్కలముందు, కోకల్లోంచి బయటపడ్డ బొడ్లముందు, ఒలంగా ఉవ్వెత్తుగ ఎగసి పడే ఎక్కోజాలముందు తాగినవాడిలా తారాడుతున్నాడు దాలయ్య.

దాలయ్య సంగతి అందరికీ తెలుసు. దాలయ్యలాంటి వాళ్ళుంటారని వాళ్ళకీ తెలుసు

అయితే వారి ప్రవర్తన కొందరికి అల వాటు పోనీలెమ్మని కొందరు సరి పెట్టుకుంటారు ఏడిపించాలనే ముఖం ముందు ఒళ్ళు విరుచుకుంటారు కొందరు. ఈ రెండుతెగలకు చెందనివాళ్ళుని దుర్భరం. పొలం గట్టుమీద తిష్టవేసి సూదిని చూడా లని తాపత్రయపడుతున్న దాలయ్యను చూపించింది సూరికి రత్తాలు కళ్ళల్లో అసహ్యం తాండవిస్తుండగా పయ్యెదను సరిచేసికుని తనపనిలో నిమగ్నమై పోయింది సూరి

సూర్యుడు నడినెత్తిమిదకు వచ్చేవరకు, ఎవరికి పని తప్ప వేరే ధ్యాస లేదు

పన్నెండయింది.

చెరువులో చేతులు కాళ్ళూ కడుక్కుని తాటిచెట్లక్రింద భోజనం మూటలు విప్పా రందరూ. కూడుతినడం అయిందనిపించే టప్పటికి వచ్చిపడ్డాడు దాలయ్య 'లెగండి!



లేగిందీ" అంటూ.

పనివాళ్ళు పరిసోతును కట్టెలుకట్టి పోగులు పెట్టటంలో మరల నిమగ్నమై పోయారు ఆడవాళ్లంతా లేవారు రామి మాత్రం కూర్చునే ఉంది

'లెగే! రామీ లెగే!' అంటూ సైకి లేవ దీశాడు దాలయ్య

చిరుకోపాన్ని ప్రదర్శించిందది వీపుమీద లేండేసి ముందుకు తోసాడు. అయినా దానికిది ఆనందమే. ఎవరూ చూడకపోయినా రత్తాలు గమనిస్తూనే ఉంది.

'ఏంటది? ఒంటిమీద సెయ్యేస్తాడు?' అంది మారి, తన ఒంటిమీదే చెయ్యి పడ్డంత బాధపడుతూ.

'దానికది యిష్టం. అట్టాంటి మొగ, సుల్పే ఏరుద్ది సుక్కా'

'మరి ఈళ్ళలో సీవెట్ట జేరినవ్? నన్నెల జేరిపించినవ్?'

'పెళ్లికాని పిల్లల నేటిసెయ్యిడు అళ్లతో యివ్వారంకట్టం. అందుకని. ...'

'అందుకని కాపురాలు సెడగొడ్తాడా?'

'నిచ్చేసింగా! ఆడిమాట కెదుర్నేదీ ఊర్లో ఈళ్లలో శానమంది ఈడిపక్కలో కొందరు యిష్టముండి కొందరు యిష్టంలేక'

'ఛీ! ఎంమగాళ్ళు! ఈ మగాళ్లు సూత్తా ఊరకుంతరా?'

'ఓసె ఎర్రిమొకమా? అంత పబ్బ లిక్కాగా దొరుకుతడా ఏంది? ఎవురికీ దొరకని దొంగ. ఈడంటె ఈ మగవాలి కందరికీ దేవుడు. దరమపెబువు ఈడిమాట కాదని ఏ ఆడదీ బతకలేదు కూలి దొరకదు, కూడూ దొరకదు, కొంపా దొరకదు, అంతా ఇనిత్తారం మరిగిదంతా ఎట్ట చేస్తడో ఎవురికీ తెలియదు ఈడిమీద ఏటిసెప్పినా ఏమగనాయిలూ నమ్మడు ఈడిసేతనబట్టి ఆడది ఉరేసుకునేనన్నా సావాలి నేదా ఆడు సప్పినట్టల్లా ఆడాల'

దాలయ్య గమనించటం సూసి ఎనిలోకి జారుకున్నారిద్దరూ

పొలానికి దూరంగా ఉన్న తాటిసెట్ల క్రింద రామితో సంభాషణ సాగిస్తూ ఆన వంకే పదేపదే చూడటం చూసింది మారి

రామి కూర్చుని చెపుతోంది వింటు న్నాడు దాలయ్య

'కొండడి పెళ్ళమా? ఇంత సక్కని దాన్నేడ సంపాయించినడే?' బాధపడ్డాడు దాలయ్య

'అదా! అదో కత!' మొదలుపెట్టింది రామి! 'ఒకసారి కొండడు గిదేదో పట్నం ఎల్లినడు ఆడ ఈమె ఎందుకులేవరో ఉండార్లే! గింతె ఆ ఇంటకాడ బొయికాడికి ఒచ్చిదంట యారి ఎటికీ ఈడూ సూసినడు. అదీ సూసినది మనువుమాటేమోగాని అది మనసు పడ్డది గయితే ఒకనాటి మాపటేల బొయికాడ నీటికొచ్చినాదంట గంతలోనే దీనివెనుక తాచుపాము జరజర పాకి ఎయ్య బోయిందట గదిసూసి ఎంటనే ఆడనే ఉన్న కొండడు అరెజంటుగా దిన్నిపక్కకు గుంజి అదేదో మూలికసూపి వట్టేసిండట. గంతే! ఆడితో వచ్చేసినాదంట దానికీ ఎవురూ లేరంట. ఎవురింటికోవే ఇల దాసుకునేదంట."

# కొన్ని సామాన్య వ్యాధులకు పథ్యాపథ్యములు

### విస్ఫోటక రోగులకు

**పథ్యములు —**

విస్ఫోటకం (ఎగ్జిమా) గలవారు మంచి ప్రాతబియ్యపు అన్నం, జొన్న అన్నం, వెదురు బియ్యపు అన్నం తినవచ్చును పెసరపప్పు, కందిపప్పు, మసర పప్పు—వీనికట్లు అన్నంలో కలుపుకొని అగుమాత్రం నెయ్యి వేసుకొని తినవచ్చును బీరకాయకూర, పొట్లకాయ కూర, పొట్ట కాకరకాయకూర, చిర్రికూర, పెంపలి కూర తినవచ్చును ఆవుమజ్జిగా అన్నం తినవచ్చును అడవి ప్రదేశాలలో సంచరించే మృగ పక్షుల మాంసములు తినవచ్చును

**అపథ్యములు —**

క్రొత్తబియ్యపు అన్నం, చల్దన్నం తిన కూడదు మినుగులతోను, ఉలవలతోను చేసే పదార్థాలేవి తినకూడదు చముర్లుగల పదార్థాలు తినకూడదు, విదాహకర పదార్థాలేవి తినకూడదు తినే ఆహార పదార్థాలలో ఉప్పు, పులుసు, కారం బాగా తగించెయ్యాలి వంకాయ కూర, మునగకాయకూర తిన కూడదు పెరుగు అన్నం తినకూడదు

### విద్రధి రోగులకు

శరీరములోపల పుట్టెడి ప్రకరకమైన వ్రణమునకు విద్రధి అని అంటారు

**పథ్యములు —**

పండిన ప్రాతబియ్యపు అన్నం తినాలి ఉల వలతోను అనుములు తోను చేసే పదార్థాలు తినవచ్చును పెసరగంజి త్రాగవచ్చును లేతమునగకూర, కాకరకాయకూర, అరటి కాయకూర, పొట్లకాయకూర, తెల్లగలిజేరు కూర, నెల్లికూర తినవచ్చును అన్నంలో మానె, నెయ్యి వేసుకోవచ్చును చెరకుపానకం త్రాగవచ్చును కూరలు పచ్చళ్ళు మొదలగు వానిలో అల్లంవేసుకొని తినవచ్చును అల్లం పచ్చడి తినవచ్చును తేనె మోతాదుగా పుచ్చు కోవచ్చును నిర్జల ప్రదేశపు జంతు మాంస ములు తినవచ్చును మరగకాచి చల్లార్చిన నీరు త్రాగడం శ్రేయస్కరం

**అపథ్యములు —**

క్రొత్త బియ్యపు అన్నం, చల్దన్నం తిన కూడదు పెరుగూ అన్నం తినకూడదు రోగం తగ్గేవరకు ఎండూ పాలు త్రాగడం మంచిదికాదు భుజించె పదార్థాలలో ఉప్పు, పులుపు, కారం బాగ తక్కువగా ఉండాలి చప్పిడి పథ్యం వాంఛనీయం బాగా చలువ చేసే పదార్థాలు తిన కూడదు తాంబూలం వెయ్యకూడదు పగటివేళ నిద్రపోకూడదు రాత్రులందు నిద్రపోకుండా మేల్కొకూడదు గిగ్గరగా మాట్లాడ కూడదు అధికంగా నీళ్ళు తాగ కూడదు అతిగా నడవకూడదు వ్యాధి బాగా తగ్గేటంత వరకూ మైథునం మానెయ్యాలి కష్టభరితమైన పనులు చెయ్యకూడదు కోపం, దుఃఖం విచారం యిటువంటి మానసిక ఉద్రేకాలకు, బాధలకు లోను కాకూడదు

**సేకరణ ఆకుండి నారాయణమూర్తి**

# మొగలినాగు

"మాట యిసే రకమేనా ?"

'తాసుపాము బాబూ! దాన్ని జోలి పెట్ట మాక' అంది రామి విలాసంగా నవ్వాడు దాలయ్య సూరిని చూచి రామి చేలోకి దిగగానే పనిని పనివాళ్ల కొప్పజెప్పి ఇంటికి సాగాడు దాలయ్య సేచ్ఛగా ఊపిరి పీల్చుకున్నారిద్దరూ. సాయంత్రంకాగానే పని చాలించారంతా బండిమీద వరినారును పనివాళ్లు సర్దుతూంటే చెరువులో కాళ్లూ చేతులు కడుక్కొని బయల దేరారంతా దాలయ్య ఇంటికి ధాన్యం కొలిపించుకోటానికి

ఇంటిలోపల చీకటిగా ఉన్న ధాన్యం గదిలో ధాన్యం కొలుస్తూ దాలయ్యే ఉండటాన్ని చూసి కొద్దిగా కంపించిపోయింది సూరి. ధాన్యం కొలిపించుకుని ఎవరిదార్ని వారు వెళ్ళిపోతునే ఉన్నారు ధాన్యాన్ని కొలిపించుకున్న రత్తాలు సూరికోసం తారాడటం చూచి పొమ్మని కసిరేశాడు దాలయ్య అవతలికి పోకపోతే వాడేం చేస్తాడో రత్తాలుకి తెలుసు నెమ్మదిగా అవతలికి వెళ్ళిపోయింది.

సూరి ఏదో జరగనున్నట్టు తెలిసికుంది చీరచెరగు పట్టుకుని నిల్చుంది. అసహ్యమైన వికటాలాడుతూ ధాన్యం కొలిచాడు. సూరి సమాధానం యివ్వలేదు

'నామాట ఏమిటంటావు ?' అన్నాడు దగ్గరికొస్తూ

ఏమిటన్నట్టు ఒకచూపు చూసింది

'అదే' అంటూ ఒంటిమీద చెయ్యి వెయ్యిబోయాడు అదనుకోసం చూస్తూన్న సూరి బలంగా దవడమీద బాది చెంగున గడిదాటి ఇవతల పడింది అవతల కాచి ఉన్న రత్తాలు సూరిచేసిన పనికి మెచ్చుకుంది కాని వెంటనే భయపడింది.

సూరి ఇల్లుచేరేసరికి కొండడు పాములన్నింటిని బుట్టల్లో సర్ది, మొగలినాగును నాగస్వరంపట్టి ఆడిస్తున్నాడ సూరిని చూచి పాట ఆపుచేశాడు. సూరి ముఖంలో అలసటను చూచి ఎదురెళ్ళి ఆప్యాయంగా 'ఎందుకే నీకీ కష్టమంతా నాను బతికుండగ నీవు కష్టపెట్టం నాను సూల్లేను. నామాటిని రేపొద్దు కాణ్ణించి ఇంటికాడే ఉండు సూడు మొకమెంత వాడిపోనాదో' అన్నాడు

కొండడి ఊరడింపు మాటలు సూరిలో బాధను మరింత త్రవ్విపోశాయి కొండడి భుజంమీద తలవాల్చి ఏడిచేసింది సూరి కొండడు కంగారుపడి అడిగేంలోపు సర్దుకుని వంటపనికి ఉపక్రమించింది వంట పూర్తి చేసి స్నానానికి వేడినీళ్ళిచ్చింది.

భోజనంచేసి తెల్లగా ఉతుకున్న చీర కట్టుకుని, సిగను విప్పి జడగా పాయలల్లుకని, అప్సరసలా తయారైంది సూరి. పడుక్కోబోయేముందు మొగలినాగుకు పాలుపోసి బుట్టలో ఉంచేశాడు బుడ్డీ దీపాన్ని చిన్నది చేసి వెల్లకితల పడుక్కున్న కొండడి ప్రక్కన చేరింది సూరి అవతల జిడజిడ వాన పడసాగింది ఊరుచివర యిల్లు అవటంచేత చీకటిబాల భయాన్ని కలిగిస్తోంది కీచురాళ్ళ అరుపులతో, కప్పల బెకబెకలతో వాతావరణం నిండిపోయింది. దీపం ఈపాటి ఆపాటి గాలికి రెపరెపలాడుతూంటే, బుట్టల్లో పాములు సర్దుకునేటప్పుడు జరజర అనే ధ్వని వినవస్తూంటే, పాముల వాసనలు పూరింటిలో పరిభ్రమిస్తూంటే, ఈదురుగాలి రొద చేస్తూంటే, అప్పుడప్పుడు దాలయ్య ముఖమే గుర్తుకు వస్తూంటే భయంతో మెలికలు తిరుగుతూ భర్తను వాటేసికుంది సూరి రెండుచేతుల్లోకి సూరి నడుమును తీసికుని దగ్గరకు లాక్కున్నాడు కొండడు.

సూరి తలనుండి కమ్మని వాసనలు గుమ్మంటూంటే నిద్రలోకి జారిపోయాడు కొండడు. రోజంతా నడుమువంచి పనిచేసిన సూరి నిద్రలోకి జారిపోయింది.

వర్షం పడుతూనే ఉంది గాలి వీస్తూనే ఉంది ఆకాశంమీద మేఘాలు పరిగెడుతునే ఉన్నాయి సగమురాతిరైంది

వీధిలో ఎవరో పిలిచినట్టయింది ఒక్క ఉదుటున లేచాడు సూరిని చేతుల్లోంచి వదిలేసి అర్ధనగ్నంగా నిదురిస్తున్న సూరిని చూస్తున్న కొండడికి అప్పుడుగాని గుర్తురాలేదు తన్నెవరో పిలుస్తున్నారని. సూరి ఒంటిమీద చీరను సరిచేసి లేచాడు కొండడు.

బయటికొచ్చిన కొండడికి ఎదురుగా దాలయ్య పాలేరు సీతడు కనిపించాడు.

'ఓరి కొండా! బాబుగారి పాలాన్న ఎవురికో పురుగు ముట్టిందట. బాబు నిన్ను పిలుస్తుండు. బేగి రా' అన్నాడు సీతడు

వీధిలో హడావుడికి సూరి లేచింది.

సమయం ఎలాంటిదైనా, ఎదుటి వ్యక్తి ఎలాంటివాడైనా, పగలైనా, రాత్రయినా, వానైనా, చలైనా ఎవడు పిలిచినా వెళ్లక తప్పదు కొండడు వాడి ముప్ఫయినాలుగేళ్ళ జీవితంలో వాడికి పేరుతెచ్చింది వాడివర్తనే. కొండడి తండ్రి తిరుపతి ఎంతటి పేరు తెచ్చుకున్నాడో అంతటిపేరు తెచ్చుకున్నాడు కొండడు

అమావాస్య చీకటిలోనైనా, పొలంగట్లో



వెంబడి నిర్భయంగా పోగల సామర్థ్యమున్న వాడు కొండడు. ఎంతటి పాములైనా భయంతో ప్రక్కకు తొలగి వాడికి దారి నివ్వాల్సిందే. ఎంతటి పామునైనా ఒంగ దీయగలవాడు కొండడు. కోరలతీసిన పాముల ఇళ్లమీదికి వదలే అల్ప గుణంలేదు వాడికి. ఎవరైనా దయతలచి యివ్వాల్సిందేగాని ఎవ రినీ నోరువిడచి అడగడు. పెద్దపండుగకి ప్రతీ ఇల్లు, ధాన్యమో, జొన్నలో, బట్టలూ పాతలూ, డబ్బు — కలిగిందేదో యిచ్చి వాడ్ని తృప్తిపరుస్తారు. కొండడు కూడా కృతజ్ఞత కలిగి ఏవేళనైనా ఋణం తీర్చుకోడానికి సిద్ధంగా ఉంటాడు·

సితడిని ముందు పామ్మనిచెప్పి లోపలికి వచ్చాడు కొండడు.

సూరి లేచి చాపమీద మణిగిలా కాలేసి కుని కూచుంది. వర్షంలో అర్థరాత్రివేళ భర్త అవతలికెళ్లవలసొచ్చిన పరిస్థితిని తలచుకొని, భయపడింది సూరి.

'దాలయ్యబాబు పొలాన్న ఎవురికో పాము కర్సిందట. రమ్మన్నడు. నేనెల్తన్నగాని తలుపేసికో. ఒగ్గంటలో తిరిగొత్తా' బయలుదేరుతూ అన్నాడు కొండడు సూరి కళ్ళలో భయం సుడులు తిరిగింది. కడుపులో చెచ్చుపోగ వచ్చినట్టయింది దాలయ్య పేరు వినగానే.

లేచి నిల్చుని భర్తవైపు చూచింది.

'మావా?.........' భయంతో పిలిచింది సూరి.

'ఏంటే' అన్నట్టు చూశాడు ప్రేమగా 'ఈ రేత్రిపూట పోకపోతే గాదా?'

తుళుక్కుబడ్డాడు కొండడు.

'ఏంటే? ఇదేం పెన్నె?'

సాయంతం జరిగింది చెప్పటానికి నోరు రాలేదు సూరికి.

'దేవుడంటి బాబు కబురెట్నాక వల్ల కుంటే దరమువా?'

మాటాడలేకపోయింది సూరి.

'ఎల్తన్నగాని తలుపేసికో' కాళ్ళ కు కీ రుచెప్పులేసికుని కర్రపట్టుకుని, పాత కాన్వాసు సంచీని చంకలో పెట్టుకుని గడప దాటుతూ చెప్పాడు కొండడు

చీకటిలో కదలిపోయే భర్తనుచూచి, ఊరికి దూరంగా విసిరివేయబడ్డ తన కొంపను చూచి బరువుగా నిట్టూర్చింది సూరి.

ఒంటిగా ఇంట్లో ఉండటం శ్రేయం అనిపించలేదు సూరికి. మనసు కీడును శంకించుతునే ఉంది. కానీ చీకటిలో ఎక్కడికి పోవటమో తెలియలేదు.

తలుపు దగ్గరకేసి గడియేసింది. గట్టిగా ఒక తాపు తంతే విరిగిపడేటట్టుంది తలుపు పుచ్చిన తలుపు గడియ అరవై ఏళ్ల ముసిల్ది. పేరుకుమాత్రమే అది.


# మిక్కిలి గొప్ప ప్రజాదరణ గల పోటీ

**ఎంట్రీ ఫీజు లేదు — మీరు కూడా ఒక బహుమతి తప్పక గెల్చుపొందగలరు**



మొదటి బహుమతి : ఒక స్కూటర్ వెస్పా లేక అల్విన్ రిఫ్రిజిరేటర్.
2 వ బహుమతి : ఒక టేప్‌రికార్డర్ లేక ఆటోమేటిక్ కెమెరా లేక రేడియోగ్రాం.
3 వ బహుమతి : (100) టోయో జపాన్ తయారు వలె 3 బ్యాండ్ ఆల్ వరల్డ్ ట్రాన్సిస్టర్స్ ధర రు. 270.
4 వ బహుమతి : (10) టోయో జూనియర్ జపాన్ తయారువలె 3 బ్యాండ్ ఆల్ వరల్డ్ ట్రాన్సిస్టర్స్ ధర రు. 250

**మీరు చేయవలసినది యేమనగా**

పై గళ్ళలో 5 (ఐదు) నుండి 20 (ఇరువది) వరకు గల అంకెలను ఒక్కొక్కటి ఒక్కొక్క మారే ఉపయోగించి అడ్డంగా, నిలువుగా, లే ఎదురెదురు మూలలు ఎట్లు కూడినా మొత్తం 50 (యాభై) వచ్చునట్లు భర్తీ చేయవలెను.

ఎంట్రీ ఫీజు : **ఎంట్రీ ఫీజు లేదు.** ఇది ఒక పాపులారిటీ పోటీ మాత్రమే.
ఎంట్రీలు పోస్టుచేయుటకు ఆఖరుతేది 25—12—72 ఫలితములు తేదీ 28—12—72

సహాయంకొరకు 46 మొత్తము గల నమూనా.

| | | | |
|---|---|---|---|
| 6 | 17 | 18 | 5 |
| 12 | 11 | 8 | 15 |
| 9 | 14 | 13 | 10 |
| 19 | 4 | 7 | 16 |

పోటీ నిబంధనలు : (1) ఎంట్రీలను పంపుటకు సాదా కాగితమును ఉపయోగించండి. (2) సవరణలు దిద్దులు గలవి అంగీకరింపబడవు. (3) ప్రమోటర్ల తీర్మానము ఖాయమైనది, చట్టబద్ధమైనది. ఈ పోటీ విషయంలో ఇదియొక ముఖ్యమైన షరతు. (4) ఎంట్రీలయొక్క సక్రమము అఫిషియల్ సీల్డు సొల్యూషన్‌తో సరిపోల్చి ఖచ్చితంగా చూపబడును. బహుమతుల నగదుగా యివ్వబడదు. (5) మొదటి బహుమతి (1) మా అఫిషియల్ సీల్డు సొల్యూషన్‌తో సక్రమంగా నున్నట్లు కనుగొనబడిన దానికి ఇవ్వబడును. (6). రెండవ బహుమతి (1) పైన అడ్డముగా నున్న మూడు వరుసలతో సమానంగా వున్న వాటికి ఇవ్వబడును. (7) మూడవ బహుమతి (100) మా అఫిషియల్ రిజల్టు యే వరుసలోగాని ఏ అంకెగానీ సమానముగా నున్నవానికి యివ్వబడును. (8) నాలుగవ బహుమతిని ఈ డ్రాలో ప్రమోటర్‌చే సంతృప్తికరముగా గుర్తించబడిన పది (10) యెంట్రెంట్స్‌కు యివ్వబడును (9) గెలుపొందినవారు, సదరు బహుమతులను పొందుటకు పోస్టేజీ, ప్యాకెంగు, లైసెన్సు ఫీజు వగైరాలను చెల్లించవలెను. (10) 3 మరియు 4 వ బహుమతులు పొందిన వారు పైన తెలుపబడిన ఖర్చులతోకూడా ట్రాన్‌సిస్టర్ ఖరీదులో సగము చెల్లించవలెను మరియు మా నిబంధనలకు లోబడి వుండవలెను. (11) ఫలితములు పంపుటకు 45 పైసల స్టాంపులు పంపవలెను. (12) ఒక కుటుంబము ఒక ఎంట్రీ మాత్రమే పంపవలెను (13) కటింగ్‌ను లేక నిబంధనల కాపీని భవిష్యత్తులో ఉపయోగములకు ఉంచుకోండి.

Director — Contest Department

**MUSIC & SOUND (WAP)**

P. O. BOX 1576, DELHI-6.

తలుపు వేశామన్న తృప్తితో చాపమై వేసింది దీపపుబుడ్డికి దగ్గరగాచేరి వత్తి వెగదోసింది

చాపమీద వెల్లకితలా పడుకున్న సూరి గుండెలమీద బరువుపెట్టి నట్లయింది లాభంలేదని ప్రక్కకు తిరిగి కాళ్లుముడుచు కొని వీధితలుపువైపే చూస్తూ తలక్రింద చెయ్యుంచుకొని పడుక్కుంది సూరి

కొండడు వెళ్లి కొన్ని యుగాలై పోయాయి

ఇంటిదాపున బయలుప్రదేశంలో నక్క లరుస్తున్నాయి ఇంటిముందున్న సింతమ్మ తల్లి గుడిలో బలివేయక వదిలేయబడ్డ కోడిపిల్లలు తమ చిన్న రెక్కల్ని టపటప లాడిస్తూ 'కూ.. కూ' మంటున్నాయి

సమీపంలో ఎక్కడో ఏదో జరజర ప్రాకిపోయిన సవ్వడి—శత్రువునోటను చేరిన కప్ప అరుపు—ఇంటిమీద పక్షులు కొడుతూ తలుపు పిట్ట అరచిన వికృతమైన అరుపులు—సూరిలో భయాన్ని ద్విగుణీకృతం చేసాయి

దూరంగా మనిషి అలికిడి — సర్దుకొని పడుకుంది సూరి

అడుగులు దగ్గర పడ్డాయి వీధిలో ఇంటి ముందు టార్చిదీపపు వెలుగు పడింది

భయంతో లేచి కూర్చుంది సూరి

అంతలో తలుపు బలమైన దెబ్బతిని లొంగిపోయింది దీపపు వెలుగులో లోపలికి ప్రవేశిస్తున్న వ్యక్తిని చూసి విభ్రాంతు రాలైంది సూరి సూరినిచూచి వికటహాసం చేసాడు దాలయ్య

'సూరీ! కోరికపడి, నీకోసం, ఈ చీక టిలో వచ్చాను లొంగిపోతావో బలవంతంగా వశపరచుకోమంటావో! చెప్పు దేనికైనా నేను సిద్ధమే'

సూరి కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి తనకోసం కాదు కొండడికోసం కొండ డేమైపోయాడో అన్నబాధ గుండెల్లో రగి లింది ఎదిరించటమెలాగో తెలియలేదు తప్పించుకోవటమెలాగో అంతకన్నా తెలియ లేదు

గుండెల మీదుంచుకున్న రెండుచేతుల్నీ జోడించింది నాజోలి పట్టకని ప్రార్థిం చింది

అందుబాటులోనున్న జంతువునైనా ఏడి పించి చంపటం వేటగాడికి సరదా

వేటికందని ఎలకపిల్లతో చెలగాట

# పెంగలి నాగు

మాడటం పిల్లికి సరదా

పెంపుడు జంతువైనా పరిధిని తరిమి కొట్టి చంపటం మనిషికి సరదా!

లొంగిన ఆడదాన్ని హింసించి అనుభ వించటం కాముకుడికి సరదా

దాలయ్య నవ్వాడు మీసాలు తిప్పుకుని వీధి తలుపును దగ్గరగా చేర్చాడు మత్తెక్కి ఎర్రనైన కళ్ళతో ముందుకడుగు వేశాడు భయంతో వెనుకకు అడుగులేసి పెరటివైపు పారిపోడానికి చూచింది సూరి

'ఏయ్!' అంటూ ఒక్క ఉదుటున సూరిని సమీపించి రెక్కను బలంగా పట్టు కుని మెలేశాడు బాధగా అరుస్తూ చూరులో అందుబాటులోనున్న కొడవలి నందుకుని ముఖంమీద బలంగా వెయ్య బోయింది చేతినందుకుని బలంగా మెలితిప్పి ఒకచేతితో పట్టి రెండవచేతితో ముఖాన్ని తనవైపు త్రిప్పుకో బోయాడు

కళ్ళలో పేరుకున్న క్రోధంతో అందు బాటులోకొచ్చిన చేతిమండను కటుక్కున కొరికి, కాలితో ఒక తాపుతన్ని, అతని బల మైన పట్టునుండీ విముక్తిపొంది, ముందుకు తూలిపోబోయి నిలవదొక్కుకుని వీధిలోకి పారిపోబోయింది

సూరి కొరికిన మండను చూచుకొని కోపంతో 'రాక్షసీ!' అంటూ ముందుకురికి సూరిని బలంగా పట్టుకుని దుశ్శాసనుని కన్నా నీచంగా రవికను చింపి, చీరను లాగ ప్రయత్నించాడు

సూరి ధైర్యాన్ని కోల్పోలేదు బలంగా ముఖంమీద బాదుతూ, రక్కుతూ, బాధగా ముఖం తిప్పుకున్న దాలయ్య గవదమీద బలంగాకొట్టి ప్రక్కకు తప్పుకుని గోడకు చేరగిలాపడి ఉండిపోయింది అలిసిపోయి

జారిపోయిన పచ్చిళ్ళను సరిచేసికునే లోగానే దెబ్బతిన్న దాలయ్య ముందుకు సమీపించటం చూచి బలంగా మోకాలితో తన్నింది అది ఎవరూ ఊహించని దెబ్బ తగలకూడనిచోట తగిలింది దాలయ్య ప్రాణం కిరకిరలాడింది అమ్మా అంటూ చేతులుతో దెబ్బతగిలిన భాగాన్ని పట్టుకుని కూర్చుండి పోయాడు, కొద్దిసేపు సూరి భయపడింది చచ్చిపోతాడేమోనని

'బాబూ!' అంది అదుర్దాగా.

నొప్పి సర్దుకుంగి తలయెత్తి చూశాడు దాలయ్య కళ్ళలో నీరు చూసి కరిగి పోయింది సూరి

'దెబ్బగిన బాగ తగిల్నాదా?' అదరంగా అడిగింది

'ఫరవాలేదు కాని ఒక్కసారి .' అన్నాడు లేవబోతూ

'ఛీ! దుర్మార్గుడా! చచ్చిపోయే దెబ్బ తిని కూడా వెధవ కోరికను, వదులు కున్నావు కావు' అనుకుంది సూరి మనసులో.

'బాబూ! వద్దు ఇన్నిడి వెల్లిపోండి. మీ మంచికే సెప్తున్నాను ఎల్లిపో బాబూ!' అంది వెరకిక్కతగ్గి

'వెళ్ళను వెళ్ళలేను నీవు చాల మంచి దానవే! నీ మనసు మంచిది ఒక్కసారి నా కోరిక ' ఎత్తుగా ఒకదానిమీద ఒకటి దొంతిగా పెట్టబడిన పాములబుట్టల నాసరా చేసికుని ఒక చెయ్యాన్ని తేప బోయాడు

సూరి ప్రమాదాన్ని గుర్తించింది

'బాబూ! ఆటిమీగ సెయ్యేయ్యకండి. లయ్య పాములు' అంది ఆదుర్దగా

'నాకు తెలుసే! అవి కోరలు తీసిన పాములు'

'కాదుబాబూ! లటిమీద సెయ్యేయ్య కండి పేనాలు పోతాయి ఇంకెప్పుడు రానంటే నానే బయటికి నడిసిత్తాను' అంది సూరి.

'కాదు సూరీ! ఒక్కసారి రా! వద్దు నే నే! వస్తున్నా' అంటూ పాముల బుట్టలమీద బలంగా చేతినాన్చి నిలబడ్డాడు.

బుట్టల్లో పాములు జరజరలాడాయి.

కుంటుతునె ముందుకడుగేయబోయాడు. కల్పోగలిగిన దాలయ్య బలంగా అడుగు వేశాడు అతనిముఖంలో తీవ్రంగానున్న కాంక్షను చూచి, తాను ప్రతిఘటించకపోతే దాలయ్య కోరికకు బలికాక తప్పదన్న సత్యాన్ని గుర్తించింది

అతను దన్ను సమీపించటానికి లవ కాశాన్నివ్వక, చెంబు, ముంత, గిన్నె కడిపె, ఏది దొరికితే దాన్ని విసిరివేయ సాగింది అతని వైపు

ఈనిన పులిలా ఉన్న సూరిని చూచి ప్రాణరక్షణకు పైనున్న పాముబుట్టను తీసి రెండు చేతులతో అడ్డుపెట్టుకుని రక్షిం చుకో ప్రయత్నించాడు

దాలయ్య మృత్యువు కెంతదూరంలో

ఉన్నాడో తెలిసికునే ధ్యాసలేదు సూరికి. తన్ను రక్షించుకోవటమే దీక్షగల సూరిదృష్టికది అందలేదు. చివరకు ఏ ఆయుధము మిగలక పోగా చివరకు మిగిలిన కత్తిపీటను తీసుకుని బలంగా విసిరింది. అతన్ని చంపే ఉద్దేశ్యం మాత్రం లేదు. దాలయ్య కత్తిపీటనుండి రక్షించుకోగలిగాడు. కాని కుడిచేతి బొటన వ్రేలుమాత్రం తెగకండ తప్పించుకోలేక పోయాడు. బాధతో, దేనితో అంతవరకూ ప్రాణాన్ని రక్షించుకుంటున్నాడో దాన్నే వదిలేశాడు.

నేలనుపడ్డ బుట్టలోంచి బుస్సున లేచింది మొగలినాగు. జరిగిన అవమానానికి, దాలయ్యను క్షమించటం దానికి తెలియ లేదు. దాలయ్య పాదాన్ని అయిదారుసార్లు కాటువేసి పశ్చాత్తాప పడింది; తన ఉద్రేకానికి నొచ్చుకుంటూ, బలంగా తలను నేలకు బాదుకుని మరణించింది మొగలినాగు.

'అమ్మో! పాము! ... కోరలులేనిది... కాదు ... కాదు కోరలు ... కోరలున్నదే ... కోరలు...' అంటూ భయంతో కేకలేసి కుంటూ వీధినిబడి నాలుగడుగులేసి కూలి పోయాడు దాలయ్య.

నాగుపాము బాలయ్యను కాటేసి, ఆ వెంటనే ఆత్మార్పణ చేసికోవటం చూచి నివ్వెరపోయింది సూరి.

దాలయ్య పొలంలో, పాము దెబ్బతిన్న మనిషెవరూ కానరాక, 'సీతడు తనకా తప్పుడు వార్తనెందుకు చెప్పాడా?' అని కంగరుగా యింటిని చేరిన కొండడికి, ఇంటి ముందు దాలయ్య కళేబరం, వీధి గడపలో తల పగలగొట్టుకుని ఆత్మార్పణ చేసికున్న మొగలినాగు, ఇంటిలోపల నిశ్చల, నిరస నేత్రాలతో, అజ్ఞాతంగా ఉండి తన్నాదుకున్న దేవుడా పూరింటిలో ఏమూలనున్నాడా అనే చింతతో దేవునికి జోతల నర్పిస్తూ చిరిగిన బట్టలతో నిల్చున్న సూరి కనిపించారు

దాలయ్య మరణానికి గని, ఆ మర్నాడు కొండడు సూరితో ఊరువిడిచిపెట్టి వెళ్ళి పోవటానికిగాని అసలైన కారణాలు ఎవరికీ తెలియవు. ●


గృహిణులకు
వరప్రసాదము
అతి త్వరితంగా పూరీలు,
ఆధునిక సాధనము —
PREETHI
Manufactured and marketed by:
P. KESAVAN & COMPANY
P.B.No. 1129 T.D. Road, Ernakulam, Cochin-11



R.S.
DAYAL
INK REGD.
దయాల్ ఇంక్
BEST FOR ALL PENS
DAYALBAGH INK FACTORY
KAKINADA




### జరిగిన కథ

రామ్మూర్తికి ఇద్దరు కొడుకులూ, ఒక కుమార్తె. పెద్దవాడు ప్రసాద్ ఉద్యోగం చేస్తున్నాడు. రెండవ వాడు కొంచెం అల్లరిచిల్లరగా తిరుగుతుంటాడు. కుమార్తె లక్ష్మి పెళ్ళికి ఎదిగి వుంది. భార్య శాంతమ్మ రోగిష్టిది. కాంచన ప్రసాద్ ఆఫీసులోనే పని చేస్తున్నది. ప్రసాద్ కాంచనా ప్రేమలో పడ్డారు. అందుచేత తండ్రి తెచ్చిన సంబంధానికి ప్రసాద్ ఇష్టపడలేదు. ప్రసాద్, కాంచనలు మరింత దగ్గరయ్యారు. పెళ్ళి చేసుకున్నారు. ప్రసాద్‌కి పిల్లనివ్వాలనుకున్న సత్యనారాయణకిది చాలా బాధ కలిగింది. రామ్మూర్తిని అపార్థం చేసుకున్నాడు. ఆలస్యంగా వచ్చాడన్న సాకుతో అతన్ని ఉద్యోగంలోనుంచి తీసేశాడు. లక్ష్మికి సంబంధాలు చూస్తున్నారు. పెద కొడుకు ప్రవర్తన పూర్తిగా మారిపోయింది. కుమార్తె పెళ్ళికి ఇల్లు తనఖాపెట్టి ఆ డబ్బును కొడుకు చేతికిచ్చాడు రామ్మూర్తి. కాంచన బాబాయి పాపయ్యమాటలు విని ఆ డబ్బును ప్రసాద్ తన వాటాకింద పొలంకొనమని యిచ్చేస్తాడు.

## 9

'అవతల ప్రైమునకు టైము అయిపోతూ ఉంది. రామ్మూర్తిగారిని ఒకసారి పిలవండి!' అని శివరావుతో మెల్లగా అన్నాడు శేషాచలం.

'వదినగారూ! అన్నగారిని ఒక్కసారి పిలుస్తారా?' అని శాంతను అడిగాడు శివరావు

'అలాగేనండి' అని అంటూ శాంత కూడా ప్రసాద్ గదిలోనికి వెళ్ళింది.

అక్కడ యేదో గొడవ జరుగుతున్నట్లు ఆమె వెంటనే గ్రహించింది.

'మిమ్మల్ని శివరావుగారు పిలుస్తున్నారు' అని రామ్మూర్తితో అన్నది శాంత.

వెంటనే రామ్మూర్తి గది యివతలకు వచ్చి 'యిప్పుడే రెండు నిమిషాల్లో వస్తాను' అని శివరావుతో చెప్పి, తిరిగి అతని సమాధానంకోసం యెదురు చూడకుండానే మళ్ళా ప్రసాద్ గదిలోనికి వెళ్ళాడు.

ఆ సమయంలో వారికి రామ్మూర్తి కేవలం మూర్తీభవించిన మానసికాందోళన వలె కన్పించాడు. రామ్మూర్తి ముఖం చూసిన తరువాత శివరావూ, శేషాచలం కూడా యేమీ మాట్లాడలేకపోయారు. డబ్బు విషయమే రామ్మూర్తి గదిలో కొడుకుతో యేదో ఘర్షణ పడుతున్నాడని వారు వూహించారు

తాను కన్నకొడుకే తనకు చేస్తున్న ద్రోహం, కూతురుకు కుదిరిన సంబంధం తప్పిపోతుందేమోనన్న ఆందోళన, తాను అన్నమాట ప్రకారం డబ్బు యివ్వలేకపోయినందువలన పదిమందిలో కలిగే అవమానం, ఆ పరిస్థితిలో తాను యింకేమీ చెయ్యలేకపోతున్నాననే పరాజయభావం యీ నాలుగూ కలిసి రామ్మూర్తిని అప్పుడు చిత్రవధ చెయ్యడం ప్రారంభించాయి.

ఈ మానసిక వ్యధనంతటినీ రామ్మూర్తి తనలో యిముడ్చుకొని, 'బాబూ! నీ వాటా గురించి తరువాత మనం మాట్లాడుకోవచ్చును. ముందు యీ డబ్బు యియ్యి బాబూ!' అని కొడుకను ప్రాధేయపడ్డాడు.

'ఇందులో మాట్లాడుకోవడానికి యేముంది? ఇప్పుడు మేం యీ డబ్బు మీకు యిస్తే, తిరిగి యివ్వడానికి మీరు యింకా డబ్బు యెక్కడైనా దాచి ఉంచారా?' అని వెటకారంగా ప్రశ్నించింది కాంచన.

'అలాగే నేను డబ్బు దాచి ఉంచినట్లయితే, యిప్పుడు డబ్బు యిమ్మనమని మిమ్మల్ని ప్రాధేయపడడం యెందుకు? నా దగ్గర యే డబ్బూ లేకపోవడంవల్లనే యింతగా మిమ్మల్ని బతిమాలవలసి వచ్చింది' అన్నాడు రామ్మూర్తి యెంతో దీనంగా.

దీనికి ప్రసాద్ కాని కాంచన కాని యేమీ మాట్లాడలేదు.

ఆ సంభాషణతో, అంత వరకు జరిగింది యేమిటో శాంతకు పూర్తిగా అర్థం అయింది.

'ప్రసాద్! మేం యేదో ఖర్చు చేసుకోవడానికి నిన్ను డబ్బు యిమ్మనమని అడగడం లేదు. నీ చెల్లెలు పెళ్ళి నిమిత్తమే డబ్బు అడుగుతున్నాం. ఆ విషయమైనా ఆలోచించు' అన్నది శాంత.

'దేని నిమిత్తం అయితే, యేం? మొత్తానికి మా వాటా డబ్బు మిమ్మల్ని వదులుకోమంటారు అంతేనా?' అని వ్యంగ్యంగా ప్రశ్నించింది కాంచన

ఇవతల శేషాచలం మాటమాటకు తన వాచీ చూసుకొంటూ కంగారుపడడం ప్రారంభించాడు శేషాచలం పడుతున్న కంగారు చూసి, శివరావే 'రామ్మూర్తిగారూ!' అని కొంచెం గట్టిగా పిలిచాడు.

'వస్తున్నానండి' అని అంటూ రామ్మూర్తి దీనంగా కుంటుకుంటూ

గదిలోపల నుంచి బయటకు వచ్చాడు. శాంత కూడా రామ్మూర్తిని అనుసరించి బయటకు వచ్చివేసింది.

'నాకు అక్కడ యెన్నో పనులు ఉన్నాయి. ఈ ట్రైను తప్పిపోతే నాకు చాలా యిబ్బంది కలుగుతుంది. ట్రైనుకు యెంతో టైము లేదు' అని కొంచెం విసుగుదలతో అన్నాడు శేషాచలం.

'రామ్మూర్తిగారూ! డబ్బుమాట యేం చేశారు?' అని ప్రశ్నించాడు శివరావు.

దీనికి రామ్మూర్తి యేమీ మాట్లాడ లేదు.

డబ్బు విషయం ప్రశ్నించగానే, రామ్మూర్తి మౌనం వహించడంతో, శివరావుకు శేషాచలానికి కూడా అనుమానం కలిగింది.

'రామ్మూర్తిగారూ, నిజం చెప్పండి. డబ్బు విషయం మీరు అసలు ప్రయత్నం చేశారా? లేదా?' అని ఆదుర్దాగా ప్రశ్నించాడు శివరావు.

'ప్రయత్నం చెయ్యకపోవడం యేమిటి శివరావుగారూ? ఇల్లు తనఖాపెట్టి అయిదు వేల రూపాయలు తెచ్చాను' అన్నాడు రామ్మూర్తి తల వంచుకొని.

'అయితే, యికనేం డబ్బు యివ్వండి' అన్నాడు శేషాచలం.

రామ్మూర్తి దీనికి యేమి సమాధానం యివ్వలేదు.

'రామ్మూర్తిగారూ! డబ్బు తెచ్చారు కదా! ఇక యివ్వడానికి అభ్యంతరం యేమిటి? ఆ డబ్బు పోయిందా?' అని అనుమానంగా అడిగాడు. శివరావు.

'డబ్బు పోలేదు కాని' అని అంటూ రామ్మూర్తి ఆ తరువాత యేమీ అనలేక పోయాడు.

కన్నకొడుకే తనకు చేసిన ద్రోహం



## మీకు సంతానం లేదా?



ఆపరేషన్, యితర వైద్యవిధానములలో చికిత్సలచే నిరాశనొందిన సోదరీమణులు, మా ఎలెక్ట్రో సంప్రదింపులచే, దేశములోపల ప్రాంతముల స్త్రీలు సంతానవతులై పంపిన ప్రశంసా పత్రము అనేకము గలవు. **ఉచిత సలహా** వివరములకు.

**శ్రీనాగార్జున మూలికా కుటీరం**

రైల్వే స్టేషన్ ఎదురు — రామాలయం వీధి,
**తెనాలి - 2**


# అనగనగా...

తలుచుకొన్నకొద్దీ రామ్మూర్తి యేమీ మాట్లాడలేకపోయాడు.

'కాని' అని ఊరుకున్నారేం? చెప్పండి!' అని ఆందోళనగా అడిగాడు శివరావు

'ఏం చెప్పమంటారు? కడుపు చించుకొంటే, కాళ్ళమీద పడుతుంది' అన్నాడు రామ్మూర్తి యెంతో నిగ్రహంగా.

'అయితే మీరు డబ్బు యివ్వలేనట్లేనా?' అని అసహనంగా ప్రశ్నించాడు శేషాచలం.

'ఒక్కనిమిషం ఆగండి!' అని అంటూ రామ్మూర్తి కుంటుకుంటూ మళ్ళా ప్రసాద్ గదిలోనికి వెళ్ళాడు.

'బాబూ! యిప్పుడు మనం డబ్బు యివ్వకపోతే శివరావుగారు, శేషాచలంగారు తిరిగి వెళ్ళిపోతారు కుదిరిన సంబంధం తప్పిపోతె, మళ్ళా సంబంధం కుదరడం కష్టం. నీ చెల్లెలు ముఖంచూసి అయినా డబ్బు యియ్యి బాబూ!' అని ప్రసాదును మళ్ళా ప్రతిమాలడం ప్రారంభించాడు రామ్మూర్తి.

'ఆ డబ్బు మేం తీసుకొన్నాం అని యింతకుముందే చెప్పాం కదా! ఇంకా యెన్నిసార్లు చెప్పాలి?' అని విసుక్కున్నది కాంచన

'అవును, నేను చెప్పేదికూడా అంతే' అన్నట్లుగా ప్రసాద తండ్రి ముఖంవైపు చూశాడు.

అప్పుడు రామ్మూర్తికి యింకో ఆలోచన వచ్చింది.

'సారీ బాబూ! ఆ అయిదువేలలో రెండు వేలు నువ్వు తీసుకో, మిగిలిన మూడువేలు యియ్యి! అబ్బాయి చదువు నిమిత్తం మూడువేలు యిస్తామని అన్నాం కదా! ఈ మూడువేలు యిప్పుడు యిచ్చివేస్తే, యిప్పటి సమస్య తీరపోతుంది పెళ్ళి ఖర్చులగురించి తరువాత నేను యేదో తంటాలు పడతాను బాబూ! అందుచేత ఆ మూడువేల రూపాయలైనా యియ్యి!' అని కేవలం యాచిస్తున్నట్లుగా రామ్మూర్తి అడిగాడు.

కొడుకును మూడువేలరూపాయలు యిమ్మని అడుగుతున్నప్పుడు, రామ్మూర్తి మాటల్లోని నిస్సహాయతా, ముఖంలోని ఆందోళనా — ఆనాడు తనకు ప్రాణభిక్ష పెట్టమని విష్ణుమూర్తికి మొరబెట్టుకొంటున్న గజేంద్రుణ్ణి గుర్తుకు తెచ్చేటట్లుగా ఉన్నాయి

రామ్మూర్తికి ఆరిపోతున్న ఆశ ఒకసారి కొంచెం వెలిగింది. పోనీ రెండువేల రూపాయలు తీసికొని మూడువేలైనా కొడుకు తిరిగి యిస్తాడని రామ్మూర్తి అనుకొన్నాడు

ప్రసాద్ అసలు తండ్రివైపు చూడకుండా పక్కనే టేబులుమీద ఉన్న పత్రిక యేదో తిరగవేస్తూ 'అసలు ఆ డబ్బు నాదగ్గర లేదు పాపయ్య మామగారికి యిచ్చివేశాను' అన్నాడు యేమీ తొణకకుండా

దీనితో రామ్మూర్తి ఆశ మొదలు నరికిన చెట్టువలె కూలిపోయింది. ఆ పరిస్థితిలో తాను చేసేది యేమీ లేకపోవడం వలన రామ్మూర్తి నీరసంగా కుంటుకుంటూ గదిబయటకు వచ్చివేశాడు

గది బయటనే నిలబడ్డున్న శాంత వెంటనే రామ్మూర్తి చెయ్యిపట్టుకొని అతన్ని కుర్చీవద్దకు తీసికొనివెళ్ళి కూర్చోపెట్టింది. రామ్మూర్తి తలవంచుకొని కూర్చున్నాడు

భర్తకు కలిగిన అవమానం కొడుకు చేసిన ద్రోహం, కూతురు భవిష్యత్తు, వీటిని తలుచుకొన్నకొద్దీ శాంతకు దుఃఖం పొంగి పొర్లుతూ ఉంది కాని ఆమె అతికష్టంమీద ఆ దుఃఖాన్ని దిగమింగి భర్త పక్కనే శిలాప్రతిమలాగ నిలబడింది.

లోపల నడవతలుపు పక్కనే లక్ష్మి నిలబడి, యింట్లో జరుగుతున్న గొడవ నంతటిని గమనిస్తూ ఉంది నడవ ప్రసాద్ గదిపక్కనే ఉండడంవలన గదిలో జరిగిన సంభాషణ చాలవరకు ఆమెకు వినిపించింది. 'ఈ గొడవ అంతా తన పెళ్ళిగురించే జరుగుతున్నది కదా!' అని ఆమెకు చాలా బాధ కలిగింది.

'రామ్మూర్తిగారూ! డబ్బు యిస్తారా?' అని శేషాచలం కొంచెం గట్టిగా అడిగాడు.

రామ్మూర్తి వెంటనే చేతులు జోడించి 'క్షమించాలి బాబూ! డబ్బు యివ్వలేను' అని యెంతో ప్రాధేయపూర్వకంగా అన్నాడు

(41వ పేజీ చూడండి)


**మూలశంకకు**
త్వరగా
నమ్మకమైన
**హెడన్సా**
విరేపనముతో
చికిత్సను పొందండి
-శస్త్రచికిత్స
అవసరములేదు!

ఇప్పుడు
ఒక కొత్త
ప్యాక్‌లో




OBM-2322 TEL

# సినిమా

## డి. వి. ఎస్. లో రామారావు—జమున

గత ఏడు విడుదలైన చిత్రాలలో డి వి ఎస్ ప్రొడకన్స్‌వారి 'చిన్ననాటి స్నేహితులు' ప్రజామోదం పొందిన విషయం పాఠకులకు తెలుసు డి. వి ఎస్ ద్వారా వచ్చే ప్రతిచిత్రం ప్రజాదరణ పొందుతూనే వుంది మంచికథ దొరికి, దానికి మినిమమ్ గ్యారంటీ వుంటుంది అన్న నమ్మకం కుదిరితేనేగాని, చిత్ర నిర్మాణానికి వుపక్రమించరు, నిర్మాత డి వి ఎస్. రాజు.

ప్రస్తుతం జి ఎన్ చెట్టిరోడ్డులోని వారి ఆఫీసులో కొత్త చిత్రానికి సంబంధించిన కథపై చర్చ జరుగుతూ వుంది జనవరిలో షూటింగు ప్రారంభమవుతుంది

## లాయరుగా ఎన్టీ ఆర్

ఈ చిత్రానికి సముద్రాల మాటలను వ్రాస్తారు దర్శకత్వాన్ని సి ఎస్ రావ్ నిర్వహిస్తారు. లాయరుగా ఎన్టీ ఆర్, వారి సహధర్మచారిణిగా జమున నటిస్తారు డి వి ఎస్. రాజు నిర్మించే యీచిత్రంని విజయా పిక్చర్స్ ద్వారా విడుదలవుతుంది.

## యాక్టింగ్ స్కూల్!

బొంబాయిలోని పూనా ఫిలిం ఇన్‌స్టిట్యూటు లాంటి దానిని మద్రాసులో జనవరినుండి మొదలెట్టడానికి దక్షిణభారత ఫిలిం వాణిజ్య సంఘం నిర్ణయించినట్టే, ఛేంబర్ కార్యదర్శి డి. వి. ఎస్. రాజు చెప్పారు.

'ఈ సంస్థకు ఎస్. అయ్. ఎఫ్. సి. సి. అని పేరు పెట్టారట యాక్టింగులో రెండేండ్ల డిప్లొమా కోర్సు వుంటుంది. బాల బాలికలు, యీ కోర్సులో చేరవచ్చు. బాలుర వయస్సు 18—24 మధ్య వుండాలి. బాలికల వయస్సు 16—22 మధ్య వుండాలి. మినిమమ్ ఎస్. ఎస్. ఎల్ సి. పరీక్ష పాసై వుండాలి.' అన్నారు రాజుగారు.

పై సంస్థకు బి. నాగిరెడ్డిగారు అధ్యక్షులుగా డి. వి. ఎస్. రాజు కరస్పాండెంట్‌గా వ్యవహరిస్తారు. వీరితో బాటు సుందరలాల్ నహతా, ఏ. పి నాగరాజన్, వి. సి. సుబ్బరామన్, పి పుల్లయ్య, సి. ఎన్ రామానుజం, పంజు, రామూ కరియత్, వై. ఆర్... స్వామి మరియు బి ఎన్. రెడ్డి ముఖ్యసభ్యులుగా సలహాదారులుగా వుంటారు. ఈ ఫిలిమ్ యిన్‌స్టిట్యూట్‌కి ప్రిన్సిపాల్‌గా విదేశానుభవం గడించి, అనేక డిగ్రీలను పొందిన రాజారామదాస్ గారు నియమింపబడినారు తెలుగు, తమిళం, కన్నడం మళయాళం భాషల్లో ఆరితేరిన పండితులను నలుగురిని నియమించబోతున్నారు.

## 'కొత్త మలుపు'

పైన వుదహరించిన సంస్థ చిత్ర పరిశ్రమలో కొత్త మలుపును తీసుకొచ్చే అవకాశం ఎంతేని వుంది. మనకి ప్రస్తుతం ఆర్టిస్టుల కొరత చాలా వుంది మనకున్న కొద్దిమందితో ఎన్ని సినిమాలు, తీయగలం? పైగా తమకు డిమాండు వుంది గదా అని కన్నుమిన్నుగానని రేట్లను అడుగుతున్నారు గత్యంతరం లేక కొందరు యిచ్చుకుంటున్నారు ఈ సంస్థ ద్వారా కొందరయినా రాక మానరు అలా వచ్చిన నాడు, బొంబాయిలో వలె యిక్కడ కూడా పెద్ద మార్పు తప్పక వస్తుంది ఇలాటి సంస్థను యేర్పరచబోతున్న ఫిలిం ఛేంబర్ కార్యవర్గాన్ని అభినందించాలి

## నవయుగలో నవచిత్ర

'కోడలు పిల్ల' చిత్రాన్ని జైశంకర్ అండ్‌కొ బానర్‌పై నిర్మించిన చిత్ర నిర్మాత నారాయణ చెట్టియార్ మరొక నిర్మాణ సంస్థకు అధినేత అయ్యారు దాని పేరు నవచిత్ర స్క్రీన్‌ప్లే, దర్శకత్వాన్ని ఎం. మల్లికార్జునరావు నిర్వహిస్తున్నారు.

'కోడలు పిల్ల'ను లక్ష్మి ఫిలింస్ విడుదల చేశారు నవచిత్ర వారి ప్రొడక్షన్ నెం 1' నవయుగా పంపిణీకి వెళ్ళింది

తమిళంలో ప్రజాదరణను పొందిన 'కనిముత్తు పాపా' చిత్రం యొక్క తెలుగు రూపమే యీచిత్రం. అయినా తమిళంలో లేని మార్పులు తెలుగు ప్రేక్షకుల కనుగుణంగా చేర్చబడినాయి అని మల్లికార్జునరావు చెప్పారు. ఈ చిత్రానికి రాజశ్రీ రచనను, జి. కె. వెంకటేష్ సంగీతాన్ని, ప్రకాశ్ ఛాయను నిర్వహిస్తున్నారు.

## 'కృష్ణ—జమున'

పై చిత్రంలో కృష్ణ, జమున, రామకృష్ణ, చంద్రకళ ప్రధాన పాత్రలను పోషిస్తారు ఈ చిత్రానికిగాను యిదివరకే రెండు పాటలను రికార్డింగు జరిపారన్న వార్త పాఠకులకు తెలుసు డిశంబరులో షూటింగు ప్రారంభం

## మూడు చిత్రాల్లో జమున — కృష్ణ

'మేన కోడలు' చిత్రంలో దంపతులుగా నటించిన కృష్ణ, జమున కాంబినేషన్ను ముగ్గురు నిర్మాతలు వుపయోగించుకుంటున్నారు ఒకరు జోతీ శేఖర్ బాబు, మరొకరు ఎన్ వి సుబ్బరాజు, మూడవ వారు ఎమ్. మల్లి కార్జునరావు

* * *

జోతీ శేఖర్ బాబు చిత్రంలో కృష్ణ డాక్టరుగా, జమున హౌస్ సర్జనుగా నటిస్తున్నారు ఈ చిత్రం ఒక్క షెడ్యూలు పూర్తయింది పి చంద్రశేఖర రెడ్డి దర్శకుడు.

శ్రీ వాణి కంబైన్స్ పేరిట ఎన్ వి సుబ్బరాజు నిర్మించబోయే చిత్రంలో జమున, కృష్ణ క్లిష్టమైన పాత్రలను పోషిస్తున్నారు. పి చంద్రశేఖర రెడ్డి దర్శకుడు

* * *

నవచిత్ర నిర్మించనున్న చిత్రంలో కృష్ణకు గట్టి పాత్ర లభ్యమైంది. ప్రేక్షకుల సానుభూతిని అందుకునే పాత్రను జమున ధరిస్తుంది. ఎం మల్లికార్జునరావు దర్శకుడు

## ఎక్కడికెళ్ళినా జమున పేరే

గత రెండు మాసాలుగా నేను ఏ సినిమా కంపె



'కొడుకు-కోడలు'లో నాగేశ్వరరావు, వాణిశ్రీ.

నీకి వెళ్లి తారాగణం గూర్చి అడిగినా హీరో ఎవరయినప్పటికీ హీరోయిన్ మాత్రం జమున, జమున అని చెపుతున్నారు. నాకు తెలిసి జమున పది + రెండు చిత్రాల్లో నటించడానికి అంగీ కరించింది.

1972లో జమున విడుదలైన చిత్రాలను పరికిస్తే, జమునకు దొరికిన పాత్రలన్నీ వైవిధ్యం వున్నవే అన్న నిజం బయట పడుతుంది అన్నిటా రాణించింది.

## సంక్రాంతికి హీరో చిత్రాలు

రాబోయే సంక్రాంతికి అయిదుగురు హీరోలు నటించిన చిత్రాలు విడుదల అవుతున్నాయి. ఆయా హీరోలకు వున్న అభిమానులకు యీ సంక్రాంతి నేత్రపర్వంగా వుంటుంది

1. జగపతి ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌తో నిర్మిస్తున్న 'బంగారు బాబు' విడుదలవుతుంది. ఈ చిత్రంలో నాగేశ్వరరావు, రాజేష్ ఖన్నా, శివాజీ గణేశన్, శోభన్, కృష్ణ, జగ్గయ్య, ఎస్వీ రంగారావు, గుమ్మడి, నాగభూషణం, రాజబాబు, వాణిశ్రీ, రమాప్రభ, ఎస్. వరలక్ష్మి ముఖ్య పాత్రధారులు. కథ, సినిమా అనుకరణ, దర్శకత్వంను వి బి. రాజేంద్రప్రసాద్ నిర్వహించారు. అన్న పూర్ణా విడుదల. ఈ చిత్రం పై ప్రేక్షకులు ఎన్నో మధుర స్వప్నాలు గంటున్నారు

2. ఎస్. వి. ఎస్. పిక్చర్స్ నిర్మించే 'డబ్బుకు లోకం దాసోహం' కూడా జనవరిలోనే విడుదలవుతుంది. ఈ చిత్రంలో ఎన్టీ రామారావు, ఎస్వీ రంగారావు, సత్యనారాయణ, పద్మనాభం జమున, రమాప్రభ, నిర్మల, విజయ, లీలారాణి, ముఖ్య భూమికలను ధరించారు. కథ, మాటలను మోదుకూరి జాన్సన్ వ్రాశారు. సినిమా అనుకరణ, దర్శకత్వంను డి. యోగానంద్ నిర్వహించారు. తారక రామ విడుదల. ఈ చిత్రంపై ప్రేక్షకులకు మంచి అభిప్రాయం వున్నట్టు తెలుస్తూంది.

3. శ్రీధర్ ప్రొడక్షన్స్ వారి 'జీవితం' కూడా సంక్రాంతికి విడుదలవుతుంది. ఈ చిత్రంలో, శోభన్, శారద, జయంతి, కృష్ణంరాజు, వివేకానందమూర్తి, రోహిణి, నిర్మల, ముఖ్యపాత్రధారులు. కథను సి ఆనందరామం మాటలను భమిడిపాటి వ్రాశారు. స్క్రీన్ ప్లే దర్శకత్వాన్ని కె. ఎస్ ప్రకాశరావు చేపట్టారు ఈ చిత్రం పట్ల ప్రజలకు పెద్ద హోప్ వున్నట్టు తెలిసింది లక్ష్మి విడుదల

4 శ్రీ వెంకటేశ్వరా పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించే 'మంచివాళ్లకు మంచివాడు' పొంగల్‌కి విడుదలవుతుంది. ఈ చిత్రానికి కె. ఎస్ ఆర్. దాస్ దర్శకుడు. 'మోసగాళ్లకు మోసగాడు' లాగా యీచిత్రం ప్రదర్శింపబడాలి అన్నభావం ప్రజల్లో వుంది. ఈ చిత్రంలో కృష్ణ, విజయ నిర్మల, నాగేష్, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి ముఖ్య పాత్ర ధారులు. పూర్ణా విడుదల.

5. శ్రీరమణ చిత్ర యింటర్నేషనల్ నిర్మించిన 'దేవుడమ్మ' కూడా జనవరిలోనే విడుదలవుతుంది. ఈ చిత్రంలో చలం, జయలలిత, లక్ష్మి, రామకృష్ణ, గీతాంజలి రాజబాబు ముఖ్య భూమికలను నిర్వహించారు. శ్రీ పిలింస్ రిలీజ్ . ఈ చిత్రానికి కె. వి. నందనరావు దర్శకుడు. 'బుల్లెమ్మ—బుల్లోడు' లాగా యీచిత్రం ప్రజాదరణ పొందగలదన్న ఆశ ప్రేక్షకులకు వుంది.

## 'స్త్రీ కోరేదేమిటి?'

లక్షల్ని ఆర్జించిన లక్ష్మీపతి కూతురు నిర్మల మనసున్న మంచిమనిషి. ఆ నిండు మనసుతో చంద్రాన్ని ప్రేమించి ఆరాధించింది. అదే ఆమె చేసిన నేరం. అంతస్థులు అడ్డుగోడలనే లక్ష్మీపతి ఆమె ప్రేమను అంగీకరించలేదు. అయినా నిర్మల తన అభిప్రాయాన్ని మార్చుకోలేదు సరాసరి చంద్రం ఇంటికి వచ్చేసింది.

'నిర్మలా' అన్నాడు అకస్మాత్తుగా వచ్చిన ఆమెను చూసి ఆశ్చర్యపోయిన చంద్రం.

'ఇలా వచ్చానని ఆశ్చర్యంగా వుందా చంద్రం? నువ్వు కావాలని ఎపుడో నిర్ణయించుకున్నాను' ఇక్కడికి రావాలని ఎప్పుడో నిర్ణయించుకొన్నాను అంది తన నిర్ణయానికి తిరుగులేదు అన్నట్లు నిర్మల.

'అంటే'

'మంచీ—మమతాలేని చోటు విడిచిపెట్టి, మనసున్న చోటికి వచ్చాను' అంది.

'నిర్మలా, కష్టాన్ని కోరి వరించడం మంచిది కాదు. ఇంతకాలం పట్టు పరుపులు పన్నీరు వున్న చోట పెరిగావు ...'

'పొరబడుతున్నావు చంద్రం. అక్కడ ఐశ్వర్యం తప్ప ఆనందంలేదు చంద్రం! సూటిగా ఒక టడుగుతాను. నేను నీకు బరువవుతాననుకున్నావా?'

'అదికాదు, నీతో జీవితం నాకు వెన్నెల వెలుగు యిస్తుంది. కాని నాతో జీవితం నీకు చీకటి మబ్బులే అవుతుంది. నాకోసం, నాసుఖంకోసం పూలంబాటలో నడిచే నిన్ను ముళ్ల బాటలోకి రమ్మని ఎలా పిలవను?' అన్నాడు బాధగా చంద్రం.

'చంద్రం, చుట్టూ ముళ్లు వున్నాయికదా అని గులాబీ వికసించడం మానుతుందా? నువ్వు ఎక్కడ వుంటే నేనూ అక్కడే వుంటాను. ముళ్లయితే, ముళ్ళూ — పూలయితే పూలు......' ఖచ్చితంగా చెప్పింది నిర్మల ఏం సమాధానం యివ్వాలో తెలియక మౌనంగా వుండిపోయాడు చంద్రం.

హృదయాన్ని కరిగించే ఈ సన్నివేశం శ్రీపూర్ణా మూవీస్‌కోసం, పూర్ణచంద్రరావు, చంద్రశేఖర్లు నిర్మిస్తున్న 'స్త్రీ' చిత్రంలోనిది. అఖిలభారత ఖ్యాతి నార్జించిన దర్శకులు కె. ప్రత్యగాత్మ దర్శకత్వంలో తయారవుతున్న ఈచిత్రంలో కృష్ణంరాజు, చంద్రమోహన్, ధూళిపాళ, రమణారెడ్డి, కొమ్మినేని శేషగిరిరావు, మాడా వెంకటేశ్వరరావు, సారధి, కె. కె. శర్మ, చంద్రకళ, బేబీ గౌరి, శాంతకుమారి, విజయభాను మొదలగువారు



'స్త్రీ'లో చంద్రకళ, కృష్ణంరాజు.

# రేడియోపైన మహత్తర క్షణాల కోసం ఎస్ట్రెలా యొక్క శక్తివంతమైన రేడియో బ్యాటరీలు

ఎస్ట్రెలా యొక్క శక్తివంత
మైన రేడియో బ్యాటరీలు.
మీ ప్రియమైన సంగీతం
అధిక-శక్తివంతమైన ఎస్ట్రెలా
బ్యాటరీల వల్ల అతి శ్రావ్యం
గాను, సంపూర్ణ ధ్వనితోను
ప్రసారమౌతుంది. కాగితపు,
ప్లాస్టిక్ మరియు లోహపు జాకెట్లలో
అమర్చబడియున్న బ్యాటరీలలో
కావలసినవి ఎంచుకోండి అవి
లీక్-ప్రూఫ్ మరియు చాలాఎక్కువ
కాలం ఉపయోగ పడతాయి అతి
కాంతిగల వెలుగునకు, నమ్మకముగా
పనిచేయుటకు టార్చీలకు
కూడ సరియైన ఎన్నికైనవి





**ఎస్ట్రెలా బ్యాటరీస్**

**అధిక శక్తి అధిక ఉపయుక్తం**

ఎస్ట్రెలా బ్యాటరీస్ లి
బొంబె-19

కాక నూతన నటుడు సత్యనారాయణ దీక్షిత్ నటిస్తున్నారు

మాటలను రా. వి శాస్త్రి, సంగీతాన్ని మహదేవన్, ఛాయను శేఖర్ సింగ్, కూర్పును దండపాణి, కళను బి. యస్. కృష్ణ, సహకారదర్శకత్వాన్ని కె. బాబూరావు నిర్వహిస్తున్నారు. సహ నిర్మాతలు పి ఆర్. కృష్ణ, డి. కృష్ణారావు విడుదల శ్రీ ఫిలింప్

## మంచివాడికి మిగిలేదేమిటి

కాలం కలిసి రానప్పుడు మంచిచెయ్యబోయిన చోట చెడు ఎదురు వస్తుంది. పాపం మంచివాడు ధర్మారావు విషయంలోకూడ యిదే జరిగింది కామరాజుని నమ్మి వ్యాపారం చేస్తే అతను మోసం చేశాడు ఆవిషయం తెలియని ధర్మారావు తమ్ముడి బిడ్డలంతా.

'పెద్దనాన్నా, నీబుద్ధి ఇప్పుడు బయట పడింది ఇంతకాలం చదువురాని పంతుళ్లదగ్గర చదివించి మమ్మల్ని సన్యాసుల్ని చేశావ్' అన్నాడు అశోక్‌కుమార్

'ఈవేళ లారీలు పోయాయ్ రేపు యిల్లుగూడ పోతుంది' అన్నాడు కిషోర్ కుమార్

'ఇవి నిజంగా పోతున్నాయా లేక కామరాజుతో లాలూచి పడుతున్నారా, మాకు తెలియాలి—' అన్నాడు దిలీప్‌కుమార్

వాళ్లమాటలు వినలేక 'తమ్ముడి బిడ్డలై యుండి మీరే ఇలా మాట్లాడుతార్రా?' అన్నాడు ధర్మారావు బాధగా

'తమ్ముడి బిడ్డలం కాబట్టే తాడు, బొంగరం లేనివాళ్లని చేసావ్'

'చివరకు మనకు చిప్పా, కర్రా యిచ్చిపంపించేస్తార్రా'

'మమ్మల్ని మీతమ్ముడి బిడ్డలుగానే బ్రతకనివ్వండి'

'అంటే' అన్నాడు ఆశ్చర్యంగా ధర్మారావు.

'అంటే యీ జాయింట్ ఆస్థిలో మిగిలిన యిల్లయినా మాకు వదిలేసి మీరు గెటవుట్'' అన్నాడు చలం ధర్మారావు నిర్ఘాంత పోయాడు.

హృద్యమైన ఈ సన్నివేశం శ్రీకాంత్అండ్ శ్రీకాంత్ ఎంటర్ ప్రైజెస్ వారి 'పెద్దకొడుకు' లోనిది ప్రఖ్యాత దర్శకులు కె. యస్. ప్రకాశరావు దర్శకత్వంలో తయారవుతున్న ఈ చిత్రంలో శోభన్‌బాబు, నాగభూషణం, నాగయ్య, వివేకానంద్, కాంచన, యస్ వరలక్ష్మి, జయ, రమణారెడ్డి తదితరులున్నారు

రచనను సముద్రాల, పాటలను డా. సి నారాయణరెడ్డి, సంగీతాన్ని ఆదినారాయణరావు, కెమెరాను శ్రీకాంత్, ఆర్ట్ను బి. చలం, ఎడిటింగ్‌ను యస్. బి. యస్. కృష్ణ, అసోసియేట్ దర్శకత్వాన్ని రాఘవేంద్ర రావు, ప్రకాశరావు, నిర్వహణను రామదొరై, ఎగ్జిక్యూటివ్ నిర్మాత బాధ్యతను మధుబాయ్ పటేల్ చేపట్టారు. నిర్మాతలు శ్రీకాంత్ సహతా, శ్రీకాంత్‌పటేల్ రాజశ్రీ రిలీజు.

# సి ని మా

## 'రామరాజ్యంలో బృందావనం'

రాధామాధవులు ప్రణయాధి దేవతలు. వయసులో వున్నపిల్ల ప్రేమలో పడితే తన ప్రేమికుడ్ని మాధవుడుగా తను రాధగా ఊహించుకుంటుంది తను వున్నఇల్లే బృందావనం అవుతుంది. పరిసరాలు యమునా సైకతాలు అవుతాయి మనసు పురి విప్పిన వనమయూరం అవుతుంది. హృదయంనిండిన ఆనందంలో తన మాధవుడ్ని ఆహ్వానిస్తూ—

'రావయ్యా! నల్లనయ్యా! నీరాధమనవి
వినవయ్యా
అనురాగానికి నీవె నిలయం
ఆత్మీయతకు నీవే రూపం'

అంటూ మధుర భావనలో గొంతెత్తి వృద్ధ మధురంగా గానంచేసింది విజయ ఆ ఆనందం అందరూ ముఖ్యంగా వయసులో వున్న పడుచు పిల్లలందరూ ఏదో ఒకనాడు అనుభవించేదే ఈ ఆహ్లాదకరమైన సన్నివేశాన్ని యువదర్శకులు కె బాబూరావు రామవిజేతా ఫిలిమ్స్‌వారి 'రామరాజ్యం'లో అద్భుతంగా చిత్రీకరించారు

అభ్యుదయ నిర్మాత కె. ఏ ప్రభాకర్ నిర్మిస్తున్న ఈ చిత్రానికి మాటలను భమిడిపాటి, సంగీత సారధ్యాన్ని ఘంటసాల, నిర్వహిస్తున్నారు లక్ష్మీ విడుదల.



'పెద్దకొడుకు'లో జయ

## తెలుగు తెరకు అమరనాథ్ తిరిగి రాక

'అమరసందేశం' 'అన్నా—చెల్లెలు' మొదలైన చిత్రాల్లో హీరోగా అత్యుత్తమనటనను ప్రదర్శించి ప్రజాభినందనలను అందుకొన్నారు అమరనాథ్. కాని కాలచక్ర భ్రమణంలో పడి కొన్నేండ్లు తెరకు కనుమరుగయ్యాడు

మళ్లీ ఇపుడు పూజ్యశ్రీ కృష్ణానందస్వామీజీ సహాయ, సలహాలతో 'బాలయోగి' అనే భక్తి ప్రదము, ప్రభోధాత్మకము మిళితమైన సంగీత చిత్రాన్ని తియ్యబోతున్నారు అతిత్వరలో సెట్స్ మీదికి వెళ్లనున్న ఈ ముక్తిదాయకమైన చిత్రంలో అమరనాథ్, విజయలలిత ముఖ్యపాత్రధారులు

అమర్‌చంద్ర నిర్మిస్తున్న ఈ చిత్రం దర్శకత్వం, కూర్పు బాధ్యతలను బి హరినారాయణ, మాట, పాటలను రాజశ్రీ, ఛాయను అప్పారావు, సంగీతాన్ని సత్యం, కళను దిలీప్‌సింగ్, స్టిల్స్‌ను బౌనా, ప్రొడక్షన్ మేనేజ్ మెంట్‌ను సి హెచ్ శ్రీనివాసరావ్ నిర్వహిస్తున్నారు

## అంటరాని పిల్ల నైవేద్యం

అంటరాని పిల్ల శాంతి. అయినా ఉదాత్తహృదయంతో ప్రేమించి, మనసిచ్చిన శ్రీనివాస్ దైవానికి నైవేద్యం పెట్టమన్నాడు. అవుననలేక, కాదనలేక కన్నీరు పెట్టింది. ఆ కన్నీటిని తుడుస్తూ 'దేవుడు దేవుడెందుకయ్యాడో తెలుసా! భక్తితో శబరి ఇచ్చిన ఎంగిలి పళ్లు తిన్నాడు చూడూ! అందుకూ! ఊ! పద! దేవుడికి నీలాంటి వాళ్ల చేతినైవేద్యం అంటేనే ఇష్టం' అంటూ ముందుకు దారి చూపాడు శ్రీనివాస్.

నైవేద్యాన్ని పుచ్చుకొని పూజగదిలో అడుగు పెట్టిన మరుక్షణం, శాంతి భక్తి పారవశ్యంతో భగవంతుని ఇలా స్తుతించింది.

ఓం నమోనారాయణా!
ఆ శత సహస్ర ఘంటాహ్వానమునాకొరకేనా
ఆశత సహస్ర వీణాగానము నాకొరకేనా
ఆ శత శత సహస్ర శంపాప్రభ దివ్యమూర్తి
నాకొరకేనా!

శాంతిగా శారద, శ్రీనివాస్‌గా శోభన్‌బాబు నటించిన ఈ సన్నివేశం మమతా ప్రొడక్షన్స్ వారి 'కాలం మారింది' చిత్రంలో కన్పిస్తుంది

సందేశాత్మకముగు ఈ చిత్రానికి దర్శకుడు కె విశ్వనాథ్, నిర్మాతలు: వాశిరాజు ప్రకాశం, బొమ్మిశెట్టి హనుమంతరావు. స్వరకల్పనను సంగీత సామ్రాట్ సాలూరి రాజేశ్వరరావు, కూర్పును సత్యం, ఛాయను అశోక్‌కుమార్ నిర్వహించారు

# కె. ఆర్. విజయయొక్క నాలుగు చక్కని రహస్యములు:



మన దేశమునకు విజయము చేసిన ఒక విలాస ప్రయాణపు ఓడమీద జరిగిన పార్టీలో
కె ఆర్ విజయ వ్యక్తిగతమైన కొన్ని నిజములను తెలుపుటకు అంగీకరించేరు
భారతదేశముకాక ప్రపంచములో వేరే ఏ చోట నివసించడానికి మీరు యిష్టపడతారు?
నిజంగా నాకు తెలియదనే చెప్పాలండీ స్విట్జర్లెండ్ బాగుంటుందేమో?
నేను నిజంగా ఆలోచించనే లేదు దక్షిణ భారతదేశం ఎంతో బాగుంటుంది
మీ పుట్టిన రోజుకు ఏ బహుమానము అంటే యిష్టపడతారు?
దక్షిణాది పట్టు చీర చాలు దాని తళతళ చూస్తే నాకు ముచ్చటవేస్తుంది
మీకు యిష్టమైన ఆభరణములు?
వజ్రములు పొదిగిన జయపూర్ మీనా నగిషీ వస్తువులు
విజయా మీ అందపు రహస్యము ఏమిటి?
లక్స్ ప్రపంచమంతటికీ తెలిసినదే

**'నా వర్చస్సు మృదువుగా ఉండడానికి
కారణము నేను లక్స్ వాడడమే—
అది శుద్ధమైనది మరియు ఎంతో
సౌమ్యమైనది కూడాను.'**




హిందుస్తాన్ లీవర్ లిమిటెడ్ వారి ఒక నాణ్యమైన తయారు

# సి ని మా

## 'తాత—మనవడు'

అయ్యో, అయ్యో, ఎందుకు గొయ్యి'— అనే గీతాన్ని ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి 'తాత—మనవడు' చిత్రంలో ఒక స్టేజి బాలెలో చిత్రీకరించడం జరిగింది

అల్లారు ముద్దుగా, కంటికి పాపగా పెంచి పెద్దచేసిన ఒక తండ్రికి తనయుడు ఇవ్వవలసిన గౌరవం చూపవలసిన ప్రేమ ఎంతటిదో మనకు తెలియనిది కాదు అయితే అదే తండ్రిని పోషించటం భారంగా తలచి, సజీవంగానే అతన్ని పూడ్చివెయ్యాలనే తలంపుతో గొయ్యి తవ్వే తనయులు ఈ ప్రపంచంలో చాల మంది లేరు కాని జీవితాన్ని ప్రసాదించిన తన పట్ల అంతటి నిర్దయను చూపుతున్న అతనికి తన కుమారుడు కూడా అలాచేయడని గ్యారంటీ ఏమిటి? అయితే తన భవిష్యత్తు కూడా ఆ మాదిరి వూహించలేని తండ్రులు ఎంతటి అవివేకులో!

సాంఘిక ప్రయోజనంగల ఈ చిత్రానికి కథ మాటలు, స్క్రీన్‌ప్లే దర్శకత్వ బాధ్యతలను దాసరి నారాయణరావు వహిస్తున్నారు

యస్ వి రంగారావు, రాజబాబు, సత్యనారాయణ గుమ్మడి అల్లు రామలింగయ్య కొమ్మినేని శేషగిరిరావు అంజలి, విజయ నిర్మల రాజసులోచన రేణుక నటిస్తున్న ఈ చిత్రానికి సంగీతాన్ని రమేష్ నాయుడు కెమెరాను కన్నప్ప ఎడిటింగ్‌ను బాలు కళను వాలి నిర్వహిస్తున్నారు నిర్మాత కె రాఘవ



'దేవీలలితాంబ'లో జయ

## తదుపరి చిత్రంలో జమున

ప్రతాప్ ఆర్ట్ ప్రొడక్షన్స్ వారి తదుపరి చిత్రంలో ఎవర్ గ్రీన్ హీరోయిన్ జమున కథానాయిక సంక్రాంతి పర్వదినాన షూటింగు ప్రారంభమవుతుంది తాత—మనవడు చిత్రానికి కథ మాటలు, దర్శకత్వం బాధ్యతలను నిర్వహిస్తున్న దాసరి నారాయణరావే ఈ చిత్రానికి గూడా దర్శకులు

## విజయలలిత ద్విపాత్రాభినయం

'చలాకీ రాణి—కిలాడీ రాజా' చిత్రాన్ని నిర్మించిన యం ఎ ఆర్ మూవీస్ వారు త్వరలో తీయబోతున్న సోషల్ పిక్చరులో సవాలుకు—సవాలు' తమిళ చిత్రంలో ద్విపాత్రాభినయం చేసి అందరి మన్ననకు పాత్రమైన విజయలలిత ప్రథమంగా ద్విపాత్రాభినయం చేస్తుంది మా యింటి వెలుగు' ఫేం విజయ్ దర్శకత్వాన్ని నిర్వహించనున్న ఈ చిత్రం యొక్క షూటింగ్ డిశంబరులో ప్రారంభమవుతుంది

## వాణిశ్రీ విదేశయానం

ప్రముఖనటి వాణిశ్రీ రాబోయే మేనెల(1973) ఏ షూటింగులోనూ పాల్గొనదు కారణం—ఆమె తన కుటుంబ సభ్యులతో అమెరికా పర్యటించాలని నిర్ణయించింది ఈ పయనం గత ఏడు జరిగివుండేది కానీ షూటింగుల వత్తిడి వల్ల ఆమె వెళ్లలేక పోయింది

## శోభన్ ద్విపాత్రాభినయం

టాలెంటు వున్న నటుడికి పాత్రలు అప్రయత్నంగానే వస్తాయి ఒకప్పుడు అక్కినేనికి యిలాగే వచ్చాయి ఇప్పుడు శోభన్‌బాబుకు, వెరైటీ వేషాలు వస్తున్నాయి అలా వచ్చిన వాటిలో సమత చిత్ర నిర్మించబోయే చిత్రంలోని తండ్రి, తనయుని పాత్రలను పేర్కొనవచ్చు

'తాసిల్దారుగారి అమ్మాయి' ద్వారా శోభన్‌బాబు నటజీవితానికి కొత్త మలుపును తీసుకొచ్చిన దర్శకులు కె ఎస్ ప్రకాశరావు గారే యీచిత్రాన్ని డైరెక్టు చెయ్యడం శోభన్ చేసుకున్న అదృష్టం అని చెప్పాలి ఛటర్జీ నిర్వహణలో తయారయే యీ చిత్రానికి ఆదివిష్ణు రచనను, సుకదేవ్ ఛాయను, అంకిరెడ్డి కూర్పును నిర్వహిస్తారు కథానాయికగా శారద నటిస్తుంది లక్ష్మి విడుదల

## శోభన్ ఏమి సాధించాడు?

అని మీరు ప్రశ్నిస్తే, మరెవ్వరూ సాధించలేని విజయాన్ని తన వశం చేసుకున్నాడు అని చెప్పగలను అతడికి యీఏడు నాలుగు అవార్డులు, లభించాయి ఇది సామాన్యమైన విషయమా?

ఫిలింఫేర్, మద్రాస్ ఫిలిం ఫ్యాన్స్ అసోసియేషన్, ఆంధ్రా సినీగోయెర్స్ గుంటూరు ఫిలిం క్రిటిక్స్ నిర్వహించిన బ్యాలెట్‌లలో 'తాసిల్దారు గారి అమ్మాయి' నటనకు శోభన్‌బాబుకు ఉత్తమ నటుడు బహుమతులు లభించాయి

## 'కొడుకు—కోడలు'

గా అక్కినేని, వాణిశ్రీ నటించారు ఎవరికో తెలుసా? ఎస్వీ రంగారావు, శాంతకుమారి గార్లకే పద్మశ్రీ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన 'కొడుకు—కోడలు' చిత్రంలోనే ఈ చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచన్ను, మహదేవన్ సంగీతాన్ని, ఎస్ కృష్ణారావు కళను నిర్వహించారు ఈ చిత్రానికి కె ఎస్ ప్రసాద్ ఛాయాగ్రహణం పెద్ద యస్సెట్ అని చిత్రంలో నటించిన వాళ్ళు, చిత్రాన్ని చూసిన వాళ్లు అంటున్నారు చిత్రదర్శకులు పి పుల్లయ్య యీ చిత్రాన్ని ఒక శతదినోత్సవ చిత్రంగా రూపొందించే ప్రయత్నాలన్నీ చేశారు

ముఖ్యపాత్రలను గుమ్మడి, రాజబాబు, రమాప్రభ, నిర్మల పోషింప డాక్టరుగా జగ్గయ్య నర్సుగా, లక్ష్మి నటించారు ఇదొక పెద్ద బడ్జెట్ పిక్చరు ఇటీవల వచ్చిన చిత్రాలలో వినిపించని మధురమైన బాణీలు యిందులో వున్నాయి నిర్మాత వెంకటేశ్వర్లు ఖర్చుకు వెనకాడక చాలా రిచ్‌గా సినిమాను నిర్మించారు శ్రీఫిలింస్ విడుదల

## 'ఊరికి వుపకారి'

అన్న పేరుగల చలన చిత్రాన్ని సుందరం మూవీస్ నిర్మించారు నిర్మాత ఎం ఎస్ రెడ్డి రెండు వత్సరాలు కథపై కూర్చుని, రచయిత రాజశ్రీ సహకారంతో స్క్రీన్‌ప్లేని కట్టుదిట్టంగా తయారు చేసిన కమనీయ కావ్యమే 'ఊరికి వుపకారి' చిత్రం సంచలన నటుడిగా కీర్తింపబడే చలం అంతస్తును పెంచే పాత్ర యిది ప్రతినటుడికీ నవరసాలున్న పాత్రను పోషించాలన్న అభిలాష వుంటుంది అలాంటి వేషాన్ని సృష్టించే మేధస్సు ఎం ఎస్ రెడ్డి లాంటి కొందరికే వుంటుంది పైగా యీ చిత్రంలో సంగీతం పైచేయిగా వుందని ఆంధ్రాలో పల్వురు అంటున్నారు గ్రామఫోను రికార్డులకు హెవీ డిమాండ్ అని తెలిసింది

చిత్ర పరిశ్రమలో ఏదేని చరిత్రను సృష్టించాలన్న తలంపు వున్న నిర్మాతల్లో ఎం ఎస్ రెడ్డి ఒకరు మల్లెపువ్వు లాంటి మనస్సు వున్న వీరికి 'మల్లెమాల' అన్న పేరు కూడా వుంది అనేక మందిని కష్టాలలో ఆదుకున్న వీరికి 'ఊరికి వుపకారి' చిత్రం విశేష లాభాలను తెచ్చిపెట్టడం తథ్యం

ఇది నేను అతిశయోక్తులు రాయటం కాదు మంచి కథ, మధుర సంగీతం, మధురమైన మాటలు చక్కటి నటనా ప్రాభావం నిండియున్న యీ చిత్రం దర్శకుడు కె ఎస్ ఆర్ దాసుకు కొత్త బాటను చూపిస్తుంది అలాగే నాయిక వేషధారిణి ఆరతికి మంచి భవిష్యత్తును యీచిత్రం చూపెడుతుంది విజయా విడుదల

-శ్రీనివాస్ ●

నమ్మకమైన
ఐటెక్స్
సౌందర్య సాధనములు
నా కిష్టం, నేను వాటినే
ఉపయోగిస్తాను
జయకౌసల్య
EYETEX
4 IN 1
BINDI
EYETEX
REGD
EYETEX
KUMKUM PASTE
11 IN 1
ARAVIND LABORATORIES,
MADRAS-33

# ప్రశ్నోత్తరాలు

**...కె. రామలక్ష్మి...**

**పి. ఎస్. వి పి. ఆర్, భిలాయి**

**నేటి స్త్రీ దుస్తులు—దేశంలో బట్టల ఖరీదు హెచ్చయినందుకా? సిగ్గు చవుక అయినందుకా? యిలా తయారవుతున్నాయి?**

ఖరీదు తక్కువని కాదు. సిగ్గు చవుకయీ కాదు. ఈ కాలపు పోకడ అది. అంతే. ఆ ఫాషన్ దుస్తులు చౌకా కాదు, సిగ్గు తీసేవి అంతకన్నా కాదు. చూసే మీ ఛాందసుల దృష్టి దోషం.

**ఎమ్. వి. పి, హైద్రాబాదు**

**మిమ్మల్ని చాలామంది గొప్ప రచయిత్రి అని పొగిడేస్తూ వుంటారు యించుమించుగా మీ రచనలన్నీ చదివాను, చదువుతున్నాను. కాని అందరూ చెప్పుకునేటంత 'కమ్మదనం' మీ రచనల్లో నాకు కనిపించదు కావున మీకు పేరు రావడం కేవలం మీ అదృష్టమే నంటాను.**

కమ్మదనం నా వంటల్లో వుంటుంది!! యిక అందరూ అంటారే గాని నేను గొప్ప రచయిత్రి నని నేనెప్పుడూ మీకు చెప్పలేదు— ఏదో చాలా కాలంగా రాస్తూండడంతో— చెప్పగా చెప్పగా అబద్ధం నిజమైనట్టు— నేనూ రచయిత్రిని అనుకుంటున్నారు. వారిని క్షమించ లేరా విష్ణు ప్రసాద్‌గారూ!!

**ఎమ్. ఎస్, ముస్తాబాదు**

**సినిమా పేరు సంపూర్ణ రామాయణం. అందులోగల పాట 'నులివెచ్చని కౌగిలిలో నా చెలియిచ్చుట' అన్న సెక్సుపాట. పౌరాణిక సినిమాలలోకూడా మరీ యింత సెక్సా?**

రామాయణ కాలంలో రమ్ము కోకోకోలా లాంటివి లేవుగాని సెక్సు వుంది! ఆ మాటకొస్తే మన పురాణాలూ మన ప్రబంధాలూ— ఎంతో శృంగారాన్నీ కామాన్నీ వర్ణించ లేదంటారా? వాటిని యధాతధంగా చిత్రిస్తే ఏ సర్టిఫికెటు కూడా యివ్వరు.

**వై. పి, అలహాబాదు**

**ఈ రోజుల్లో వస్తున్న సినిమాలు చూసి పిల్లలు పాడవరని మీరు జవాబులు యిస్తూండడం చూసి నాకు నచ్చేది కాదు అయితే 29–9–72 పత్రికలో మీరు రాసిన మీ యింట్లో సెన్సారెవరు? చది వాక మీ అభిప్రాయం అర్థం అయింది. చాలా చక్కగా రాశారు. అందుకే మీరంటే నాకు గౌరవం. చాలా యిష్టం.**

సంతోషం ప్రభాకర్‌గారూ. యింట్లో వాతావరణం సవ్యంగా వుంటే— పై వాతావరణ ప్రభావం మన పిల్లల మీద చాలా తక్కువ పడుతుందని నేను చాలా బలంగా నమ్ముతాను. నా నమ్మకం తప్పుకాదని నా పిల్లలే నిరూపిస్తారు. పిల్లలకి స్వేచ్ఛ నివ్వాలి. క్రమ శిక్షణ తప్పనియ్యకూడదు. ప్రేమించాలి. ముద్దు చేయాలి. కాని లోకువ చేయనీయ కూడదు. నెత్తెక్కించుకో కూడదు. వారి అభిప్రాయాలు వినాలి. మన ఉద్దేశ్యం తెలిసేలా చెప్పాలి. సాధింపు కూడదు. వాదింపు తగును. తరాల అంతరాలు గుర్తించాలి. మన అభిరుచి వారి పై రుద్దే హక్కు పెద్దల మైనంత మాత్రాన మనకి లేదు. మన అభిప్రాయాలతో వారేకీభవించేలా— చేయ కల్గడం మనలో వుంది— అది సహృదయం, సత్‌సంప్రదాయం— సమరస భావం— ద్వారానే సాధించ కలం. అవునా?

**జి. ఆర్. ఆర్, నరసన్నపేట**

**రామలక్ష్మిగారూ, మానవుడు కష్టసుఖాలను ఎన్నాళ్ల కొకసారి మార్చ వచ్చును?**

అలా పీరియాడికల్‌గా మార్చే చేవే వుంటే— అసలు కష్టాలే తీసిపారేసేవాడు కదా— మానవుడు!

**డి. ఆర్. ఎన్, జగిత్యాల**

**అక్కయ్యగారూ, స్త్రీ తన భర్త వ్యవహారాలను తోటివారితో చెప్పినచో ఆమెకు కల్గు ప్రయోజనం ఏమిటి?**

సంతృప్తి, గర్వం— భర్తగారి వ్యవహారాలు— మంచివి అయితే! లేకుంటే— మనస్సులో బాధ కక్కుకోడానికి మాత్రమే— యితరులతో తన విషయాలు చెప్పుకుంటుంది స్త్రీ.

**జె. పి. ఎస్, విశాఖపట్నం**

**మీరు ఉదాత్తమైన రచనలు చదవరా?**

నా కింకా మామూలుగా రాసేవారి రచనలే యిష్టం సారధిగారూ, మెదడునీ మనసునీ యిబ్బంది పెట్టేవాళ్లంతగా నాకు పడరు. చీకటి చూసి, నిర్దయను చూసి దడుసుకునే వాళ్లూ, యింకా సూర్యుని ముందు దివిటీ చూపించ కలం అనుకునే వాళ్లూ— చాలు నాకు. వారి రచనలు సామాన్యం అయినా— నాకు బాగుంటాయి!

**పి. పి. డి. హైద్రాబాదు**

**మీవారంత సంపాదిస్తున్నా మీ రెండుకు ఘనంగా డ్రస్ చేసుకోరు? నగలు ధరించరు?**

మా వారెంత సంపాదించినా— నేను మా నాన్న కూతుర్ని. ఆయన గారు మామూలు గుమాస్తాగిరీ వెలిగించి నాలో చాలా స్వతంత్రంగా బ్రతికే అలవాటు పెంచారు. అంచేతనే యిప్పటికీ 'కోరికలు కోటి వున్నా— 'కొలబుర్ర వాడే' రకంగానే వుండిపోయాను సోదరీ.

**డి జె. ఎమ్, సికింద్రాబాదు**

**మిమ్మల్ని అందరూ తిడతారుకదా? వారిమీద కక్షగా వుండదా మీకు? ఉదహరణకు— మొన్నిక్కడ జరిగిన అ ర. సం సభలో తిట్టారు మిమ్మల్ని**

ఆదివారం ఎలకని చంపిందని— సోమవారం పిల్లికి ఉరిశిక్ష వేసేరకం కాదు నేను! అంచేత కక్ష వుండదు నాకు.

**మీరెందుకు అనవసరంగా సాహిత్య యుద్ధాలకి కాలు దువ్వుతారో అర్థం కాడం లేదు మాకు కొంచెం చెప్పకలరా?**

సాహిత్యం ఒక మహా సముద్రం. సముద్రంలోకి నడిచేవాళ్లు— దాల్లో రేగే తుఫాను మీద స్వారి చేయడానికి భయపడితే ఎలా?!

**సంగం, విజామాబాద్**

**స్త్రీ ఎంతో ఉచ్ఛదశలోకి వచ్చింది... గాని స్త్రీ ఎంతో పైకిపోతున్నది అంటే అంత పతనానికి దగ్గర అవుతోంది. అంత విలువ లేకుండా పోతోంది—గేరు రివర్సులో పడినప్పుడు అది పతనానికి నాంది. చివర కూడానేమో?**

మీరు డ్రయివింగు ఎక్కడ నేర్చుకున్నారు. గేరు రివర్సులో వేసినా— బ్రేకు మీద కంట్రోలుంటే చాలు. పైకి పోవడం పతనానికి నాంది అయితే— అది మీ పురుషులకు వర్తించదను కోవడం— కాకిలాగా ఒంటి కంటితో చూడ్డమే అవుతుంది! ఎంత పైకి ఎక్కితే . . . దిగవలసి వస్తే అంతపై నుంచీ దిగాలి— అన్యాయానికి స్త్రీ పురుష వివక్షత లేదు.

**ఆర్. ఎస్. ఎన్, బొకారో స్టీలు సిటీ**

**అక్కయ్యగారూ నేనొక పని తల పెట్టాను. రాత్రింబవళ్లు దానికోసం కృషిచేసి కష్టపడ్డాను. గాని ఫలితం శూన్యం అయింది. నేనింకా ఆశావాదినా? నిరాశా వాదినా?**

ఎక్కడ లోపం జరిగిందో వని.... తిరిగి కృషి ప్రారంభిస్తే— ఆశావాదివే బ్రదర్, ఇక లాభం లేదని ఆ పని వదిలితేనే నిరాశా వాదివి. ఈ నిరాశ యింకో పని ప్రారంభించితే మటుకు ఎదురవుదని నమ్మకం ఏమిటి? అంచేత ట్రయ్ ఎగైన్.●

1—12—72

# ...ఇంక ఇప్పుడు!




## ఈ తలనొప్పి మాత్ర మాత్రమే కలిగి ఉంది — హెచ్చు శక్తి + రక్షణ

**హెచ్చు శక్తి** ఎందుకంటె, అవేదన్ ప్లస్‌లో బాధను తొలగించే అదనపు పదార్థములు ఉన్నాయి. అది త్వరితముగా, నిరపాయముగా, నిశ్చయముగా, ఉపశమనమును కలిగిస్తుంది.

**రక్షణ** ఎందుకంటె, అవేదన్ ప్లస్‌లో చాల కాలము వాడినా హానికరమైన చెడు ఫలితములను కలిగించే పదార్థములు ఏవీ లేవు.

**తలనొప్పి, జలుబు, ఫ్లూ, ఒంటి నొప్పి, పంటి నొప్పి మరియు బహిష్టు రోజులలో**
**అవేదన్ ప్లస్‌ను వేసుకోండి.**

మోతాదు : ఒకే ఒక బిళ్ల చాలును (నొప్పి తీవ్రముగా ఉంటే రెండు బిళ్లలు వేసుకోండి)
20 బిళ్లల కుటుంబ ప్యాకులో కూడ లభిస్తోంది.

Shilpi HPMA-2A/72 Tel

®ఇ.ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రెజిస్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం దీని లైసెన్స్‌డు ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రైవేట్ లిమిటెడ్

SQUIBB® SARABHAI CHEMICALS **avedan® plus**

# శుభలేఖ




పద్మినీ చిత్తరంజన్

★ పోస్ట్ అన్న కేక వినగానే రామం ఆత్రతతో వీధిలోకి పరిగెత్తాడు. మనిషి వచ్చేవరకూ ఆగకుండానే పోస్ట్‌మెన్ కవరు గిరవాటు వేసి వెళ్ళిపోయాడు.

తెల్లటి కవరుకు నాలుగు వైపులా అంటించిన పసుపు చూస్తూ దూరం నించే 'ఎక్కడినించో! శుభలేఖ కాబోలు...నీర సంగా అనుకున్నాడు రామం. ఎలాగు ఇంతవరకూ వచ్చా గదా అన్నట్టు మరో నాలుగడుగులు వేసి కవరందుకున్నాడు.

'శుభలేఖా? ఎవరి పెళ్ళి' శశి ఉత్సాహంగా ముందుకు వచ్చి అన్న చేతిలోని కవరు తీసుకుంది.

మంచంమీద మాగన్నుగా నిద్ర పోతున్న శివరావు ఆ మాటలకు కళ్ళు తెరిచాడు. 'ఎక్కడనుంచి వచ్చింది? చదవ్వే శశీ!' అన్నాడు.

మెల్లగా అ క్ష రా లు తడుముకుంటూ 'జానక్యాః కమలామలాంజలి పుటే' అంటూ చదవటం మొదలు పెట్టింది శశి.

'అవన్నీ ఎందుకే ముందసలు పెళ్ళెవరిదో చదవక' మాణిక్యం శశికి అడ్డు తగిలి చేతిలోని శుభలేఖ తీసుకుంది.

పెళ్ళి ఎవరిదో పెళ్ళి. ఏ అదృష్టవంతులో తమ అమ్మాయికి పెళ్ళి చేస్తున్నారు. ఆత్రుతతో కలిసిన సన్నని వేదన హృదయంలో కదులుతోంది మాణిక్యానికి. అంతలోనే తల్లి మీదకి వంగి చదవటం మొదలెట్టింది. 'నా జ్యేష్ఠ పుత్రిక చి సౌ. రాధాదేవి (ఎమ్. ఏ.) ని శ్రీ రంగపురం రామారావు గారి ఏకైక పుత్రుడు చి. మోహన్ (ఎం.టెక్)కు యిచ్చి...' శశి ఆపింది.

'రాధాదేవి...రాధ పెళ్ళిటండీ...' ఆశ్చర్యంగా ప్రశ్న వేసింది మాణిక్యమ్మ.

'నాకేం తెలుసే, శుభలేఖ వింటున్నావుగా, పెళ్ళా అని నన్ను అడుగుతావేం ?' విసుక్కున్నాడు శివరావు.

'అదేమిటండీ! పెళ్ళి కుదిరిందని మాట వరసకి ఒక ఉత్తరమ్ముక్కైనా ముందుగా రాయలేదు.' ఆశ్చర్యం ప్రకటించింది.

'రాస్తే నువ్వు కట్నకానుకలు తీసుకుని పెళ్ళికి ప్రయాణం కట్టేదానివి కాబోలు' విసుక్కున్నాడు రామం తల్లిని.

రామానికీ మధ్య మరీ విసుగా వుంటోంది. ఎస్సెల్సీ పైపు హయ్యరు అయి ఏడాది దాటింది. కనబడ్డ ప్రకటనకల్లా దరఖాస్తులు పెట్టటానికి వందలు ఖర్చయినాయి. ఇంతవరకూ 'ఉద్యోగం' అనే పదం చెవిదాకా రాలేదు

'కుటుంబ పరిస్థితులు యిలా ఉంటే, వాళ్ళ పెళ్ళి అని రాయలేదని గొడవేమిటి

మార్గో సబ్బు ఒక్కటే ఒక్క శుభ్రపరచడానికేగాక
ఎంతో వుపకరిస్తుంది. చలికాలంలో గాని ఎండాకాలంలో గాని
చర్మాన్ని రక్షిస్తుంది

# ఎందుకంటే మార్గోలోనే వేపనూనె వుంటుంది






మార్గో సబ్బు నురుగు వెన్నలా వుంటుంది. సహజమైన వేపనూనె సమృద్ధిగా వుంటుంది. లావణ్యంతో చర్మాన్ని పోషించడానికి కావలసిన జిడ్డు పదార్థము. వేపయొక్క పూతినాశక గుణములు అంటురోగములను రానీయదు. మార్గో చర్మాన్ని మృదువు పరచి మచ్చలను పోగొడుతుంది. అంతేగాక మార్గోలోనున్న దుర్గంధాన్ని పోగొట్టే వేపనూనె గంటలకొద్దీ తాజాగా నవనవ లాడింపజేస్తుంది. హానికరంగాని వెన్నవంటి మార్గో సబ్బు మీ కుటుంబమంతటికి ఎంతో వుత్తమమైనది!

**మార్గో సబ్బు**

మీ చర్మాన్ని
మృదువుగాను,
సున్నితముగాను వుంచును

కలకత్తా కెమికల్సువారి తయారి

CCM/4183

# శుభలేఖ

ఎవరింట్లోనో పెళ్లయితే మన పొయ్యిలో పిల్లి లేస్తుందా?' లోపల గొణుక్కుంటు న్నాడు రామం

'శుభలేఖ మీదబొమ్మ నాది'—చంద్రుడు అప్పుడే అక్కతో తగాదాకి దిగాడు.

'చక్కగా ఉంది సీతారాముల బొమ్మ. నువ్వు చింపేస్తావు వెధవా ! నీ కివ్వను' అంటోంది శశి

'శుభలేఖ చింపకండర్రా' కసిరింది తల్లి.

'ఇలా ఉన్నాయి రోజులు ! మీరు అన్న గారు గదా! ఇలా పెళ్ళి కుదిరింది ముహూర్తాలు పెట్టుకుంటున్నాం' అని రాసు కోరూ. పరాయివాళ్ళకు మల్లే ఓ శుభలేఖ పారేస్తాడా' మాణిక్యం తనలో అనుకున్నట్టుగా గొణిగింది.

'రాధ మన సుగుణ ఈడుదే. అప్పుడే ఎం.ఏ వరకూ వచ్చిందిగాబోలు' శివరావు మంచంలో ఆలోచనలో పడ్డాడు.

'మనమ్మాయికీ ఏద్త్తైనా చూసి ముడెట్టండీ అంటే విన్నారు గాదు. నేను ఏమైనా అంటే నామీద ఖస్సుమని లేస్తారు' భర్తని ఉద్దేశించి అంది మాణిక్యం.

'ఊఁ' శివరావింకా ఆలోచనలోనే ఉన్నాడు.

'ఆ బందరు సంబంధం ఒప్పుకుంటే ఈపాటికి మనపిల్ల యిద్దరు పిల్లలతల్లి అయ్యేది' మాణిక్యమ్మ ధోరణిలో బాగా అసహనం కనిపిస్తోంది.

అవునుమరి సుగుణ ఎస్సెల్సీ అయ్యి ఆరేళ్ళయింది. ఊరికే కూచోటం ఎందుకని రెండేళ్ళపాటు సెకండరీగ్రేడు టీచర్ ట్రైనింగ్ చదివింది. అదృష్టవశాత్తూ ఉన్నఊళ్ళో ఉద్యోగం అయింది ఈమధ్యలో సుగుణకు సంబంధాలు రాకపోలేదు. సుగుణ అనాకారా! కాదు పొందికగా అందంగానే ఉంటుంది. అందుకని కొందరికైనా చూచుకున్న వాళ్ళకి నచ్చింది. కాని శివరావు చేసే ఉద్యోగం కొద్దిపాటిది. పెళ్లి ఖర్చుకైనా అతని దగ్గర కానీ లేదు.

కొందరి దగ్గర డబ్బు ఉండదు కాని మొండితనం ఉంటుంది. తరవాత సంగతి చూద్దాంలే అనేసి అప్పులు చేసేస్తారు. శివరావుకు ఆ సాహసమూ లేదు. మరి కొందరికైతే ఎలాగోలా పిల్లని 'వదిలించుకోటమే' ముఖ్యం. అలాంటి వారు రెండో పెళ్లివాడికైనా, కాలో కన్నో వంకరున్న వాడికైనా కట్టబెట్టేస్తారు. శివరావు అలాంటి పనులకి దిగే మనిషీ కాదు.

ఇలా రోజులు గడుస్తూ ఉండగానే సుగుణ సంపాదనతో ఇంటి పరిస్థితి కాస్త మెరుగ్గా కనిపించటం మొదలు పెట్టింది. ఈ లోపలే శివరావుకి కొంచెం అనారోగ్యం మొదలైంది. తరచు జ్వరం రావటం, నీరసం అని సెలవులు పెట్టటం, దానితో ప్రతి నెలా ఎంతో కొంత జీతంలో కోత తప్పటం లేదు.

పరిస్థితి యిలా ఉంది ఆ యింట్లో. 'తమ్ముడు తెలివి గలవాడు, ఎలాగయితేనేం బాగా సంపాదించాడు. ఏమిటో ఎవరి అదృష్టం వాళ్లది. అంతా భగవంతుడి ఇష్టం.' శివరావు మళ్లీ తాపీగా కునుకు తీయటం మొదలెట్టాడు.

ఈ మధ్య అతనికి వేదాంతంమీద ధ్యాస ఎక్కువైంది. అసలు నిజం చెప్పాలంటే శివరావు ఇన్నాళ్ళుగా సంసారం బరువుమోసి అలిసిపోయాడు. ఇప్పుడు అతనికి హాయిగా చుట్ట కాల్చుకుంటూ ఇంట్లో విశ్రాంతి తీసుకోవాలని ఉంది. తను ఆడపిల్ల సంపాదనమీద ఆధారపడుతున్నానని, దానికి పెళ్లి కాకపోవటంలో తన బుద్ధి పూర్వకమైన తాత్సారం ఉందనే 'నిజం' శివరావుకు తెలుసు. ఆ నిజాన్ని ఒప్పుకునే ధైర్యం లేదు సరికదా ఆ సంగతి తలుచుకుందుకు కూడా అతనికి బాధే. అందుకే అంతా 'వాడి లీల' అంటూ తన తప్పును కనబడనివ్వ, మాట్లాడని భగవంతుడి మీదకి నెట్టడం అలవాటు చేసుకున్నాడు శివరావు.

రాధ పెళ్లి శుభలేఖతో అతనికి మళ్లీ వాస్తవం గుర్తుకు వచ్చింది. అందుకే బలవంతాన మనస్సును మాయపుచ్చి నిద్రకి ప్రయత్నం చేస్తున్నాడు శివరావు.

శుభలేఖ వచ్చినప్పట్నించి మాణిక్యానికి బియ్యంలో రాళ్ళు కనబడ్డం మానేశాయి. ఆవిడకి వెంటనే రాధ పెళ్లికన్న రెండ్రోజులుముందే సుగుణకి పెళ్లి చేసెయ్యాలన్పి[illegible]ంది.

భర్తవైపు చూసింది చాట అవతలికి తోసి. శివరావు అరమోడ్పు కళ్ళతో మంచం మీద పడుక్కుని ఉన్నాడు.

'ఎదిగిన పిల్ల ఇంట్లో ఉంటే ఈయనకెలా నిద్ర పడుతోందో' విసుగ్గా పైకే



అంది మాణిక్యం. రామానికి చిరాకు ఎక్కువైంది. 'నిద్ర పోకుండా వుంటే సరిపోతుందా ! చేసేదేమీ లేనప్పుడు నిద్రపోతేనే మంచిది. ఇన్నాళ్లవించి లేంది ఈ రోజా హడావిడి పడతావేం' అన్నాడు తల్లిని.

'ఏమిట్రా నీకీ మధ్య చిరాకెక్కువైంది. నిన్ను ఏమన్నాను నేను. పోయి నీ పని చూసుకో' గసిరింది తల్లి. రామం మింగేసేలా వో చూపు విసిరాడు. తర్వాత టైం చూశాడు. నాలుగైంది.

'నేను పోతున్నా' చెప్పులేసుకుని వెళ్లిపోయాడు. రామం ఊరికే కూచోటం లేదు. అతని అప్లికేషన్లకు కావలసిన డబ్బు రెండు చోట్ల ప్రైవేట్లు చెప్పి సంపాదిస్తూనే ఉన్నాడు.

సుగుణ వచ్చే వేళయింది. అయిదయ్యే సరికి ఇల్లంతా గలగల లాడుతుంది. మాలతి, కృష్ణుడు, ప్రభా, పద్మా, ఈపాటికి స్కూలువించి వస్తుంటారు. మాణిక్యానికి యింటిపనులమీదికి దృష్టిపోలేదు.

'ఏమండోయ్ మి మ్మ ల్నే. నేవలా వెళ్తొస్తా' తలుపు వారగాపెట్టి వెళ్ళిపోయింది మాణిక్యం.

తల్లి అటు వెళ్ళగానే శుభలేఖకోసం మళ్ళీ శశీ చంద్రుడూ తగాదాకి దిగారు.

'వెధవా ముందు నేను తీశాను. ఈ బొమ్మ ఏమైనా నీకివ్వను' శశి అంది.

'పెద్దక్కకి చెబుతానుండు. నువ్వు బడి ఎగ్గొట్టి నాతో పోట్లాడుతున్నావ్ గదూ! అన్ని బొమ్మలూ నీకేనా పాపం' చంద్రుడు శశితో కలబడ్డాడు.

'ఏమిట్రా ఎప్పుడు తగూవేనా' విసుగ్గా శశిచేతిలో శుభలేఖ లాక్కుంది సుగుణ.

అక్క కవరు తెరవటంతో పిల్లలు నోళ్లమూసుకుని ఊరుకున్నారు.

'రాధపెళ్లి' ఒక్క క్షణం సంతోషం ఉత్సాహం వచ్చినట్టే వచ్చి మాయమయ్యాయి. సుగుణ మెల్లగా నిట్టూర్చింది.

తను ఉద్యోగంలో చేరినప్పుడు బాబాయి రాశాడు 'సుగుణా ! అన్నయ్య తన సంపాదనలో నీకు పెళ్లిచేయటం కష్టం. నువ్వేలాగు ఉద్యోగం చేస్తున్నావు కనక


# దీనిని అలక్ష్యం చెయ్యకండి!




జలుబు తీవ్రపరిస్థితిని తీసుకురావచ్చును—రబెక్స్ రాయండి; ఒకేసారి గట్టిగా రాస్తే—జలుబుల నుండి రక్షణ నిచ్చి శక్తివంతముగా పనిచేయును.

* శీఘ్రంగా పనిచేస్తుంది-చర్మ గ్రంధులలోకి పోతుంది-శరీర వేడిమిని అధికంచేయును. * జలుబులను ఎదుర్కొను 7 వైజ్ఞానిక ఓషధులతో తయారైన రబెక్స్ శీఘ్రంగా పనిచేస్తుంది. దీని వలన అన్ని విధాల జలుబులకు ఉపశమనము కలుగును. రబెక్స్ ఛాతీలోని బిగుత్వమును సడలించి ముక్కు దిబ్బడను, తలనొప్పిని పోగొట్టును.

6 గ్రాముల డబ్బాలలో, 20 గ్రాముల మరియు 65 గ్రాముల సీసాలలో దొరకును.




# రబెక్స్

everest/371a/ACW Tel

ప్రతినెలా పాతికైనావెనకెయ్యి. కట్నమైనా, నీసంపాదనలో కూడితే ఏదోసంబంధం చూసి చేసేస్తాం' అని. నవ్వొచ్చింది సుగుణకి.

తన సంపాదనతోపాటు అవసరాలుకూడా పెరిగాయి. ఎప్పటికప్పుడు బాంకులో వెయ్యటం మళ్లీతియ్యటం జరిగింది రెండు మూడునెలలు. ఆ తర్వాత అదీ లేదు. 'నేను పెళ్లి చేసుకోవాలి అందుకని డబ్బు దాచుకుంటాను' అని తనెలా చెప్పగలదు. పది రూపాయలు తక్కువిస్తే తండ్రి అదోలా మొహం పెడతాడు 'చాలదు తల్లీ, చూస్తున్నావుగా నా అనారోగ్యం'అంటాడు —అంతేనా ఆడపిల్ల సంపాదన తినాల్సి వచ్చినందుకు తనని తాను తిట్టుకుంటాడు. 'రామానికి పని దొరికేవరకే తల్లీ ఆతర్వాత నీజీతం ముట్టను' అని భరోసా ఇస్తాడు.

'అమ్మాయ్ కాస్త కాఫీ పెట్టమ్మా,

# శుభలేఖ

మీ అమ్మెటో వెళ్లినట్టుంది' అన్న తండ్రి మాటతో ఈ లోకంలోకి వచ్చింది సుగుణ. మాట్లాడకుండా గబగబ వంటింట్లోకి నడిచింది.

అంతలోనే మాణిక్యం వచ్చి సుగుణ చేతిలో విసనకర్ర అందుకుంది.

వంట అయింది, పిల్లలంతా అన్నాలు తిని చాపలు పరుచుకున్నారు.

'ఇదిగో మిమ్మల్నే. ఇందాక జానకమ్మ గారింటికి వెళ్లాను రామవరంలో సంబంధం ఉందిట. వాళ్లకి కట్నాలు అక్కర్లేదుట. పిల్ల నాలుగురాళ్లు తెచ్చేదిగా ఉంటే చాలన్నారుట. ఎలాగూ సెలవలోనే ఉన్నారుగా ఒకసారి వెళ్లి మాట్లాడి రారాదూ' కంచంలో అన్నం పెడుతూ అంది మాణిక్యం.

శివరావు భార్యవైపు ఎగాదిగా చూశాడు. తలవంచుకుని అన్నం కలపటం ప్రారంభించాడు.

'మాట్లాడరేమండీ!' భార్య వదిలేట్టు లేదని అనుకున్నాడు శివరావు 'కట్నం లేకపోతే లాంఛనాలుండవా! పెళ్లిఖర్చుండదా. అసలు నీకాలోచనే ఉండదేం? కట్నం వద్దు అనగానే గంతులేస్తున్నావ్' విసుగ్గా అన్నాడు.

'ఆమాత్రం నాకూ తెలుసు. అందుకని పిల్లకి పెళ్లిచెయ్యరా యేం ? తలతాకట్టు పెట్టయినా చెయ్యాలి పెళ్లి. ఎన్నాళ్లని ఊరుకుంటారు. ముందు వెళ్లి ఆ సంబంధం సంగతి చూడండి' వెళ్లక తప్పదన్నట్టు మాట్లాడింది ఆమె. సుగుణకి నిద్రపట్ట లేదు. తల్లిదండ్రుల మాటలు చెవుల్లో పడుతున్నాయి.

ఆ మాటలకి సుగుణకి ఒళ్లు చిటచిటలాడింది. ఈ గడపకి శుభలేఖ వచ్చినప్పుడల్లా ఇదో నాటకం అయిపోయింది' అని గొణుక్కుంది.

నిజమే, శుభలేఖ రాగానే తన కూతురు పెళ్లి గుర్తుకు వస్తుంది తల్లికి వెంటనే నాలుగు సంబంధాలు వాకబు చేసివస్తుంది. భర్తని పోరుతుంది. తప్పనిసరైతే అతను వెళ్లి మాట్లాడుతాడు. పెళ్లి చూపుల వరకూ గూడా వస్తాయి కొన్ని కాని ఫలితం ఒక్కటే.

'తనకి ఉద్యోగం రాకముందు తండ్రి పెళ్లిచేయాలని ఎంతో తాపత్రయపడ్డాడు. కాని ఇప్పుడు తొందర కనబడ్డంలేదు. సరి కదా పెళ్లిచేసే ఉద్దేశమే కనబడ్డంలేదు. తల్లిమాత్రం ఎవరింట్లోనో పెళ్లి అనగానే కూతురికోసం మహా తాపత్రయపడుతుంది. వారం తర్వాత మళ్లీ అంతా మామూలే. తనేం చెయ్యాలి.' సుగుణ ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరౌతోంది. పరిష్కారం మాత్రం దొరకటం లేదు. విసుగ్గా మరోపక్కకి వత్తిగిలి పడుక్కుంది.

'నువ్వు చింపేస్తావ్. బొమ్మ నీకియ్యను' శశి నిద్రలో కలవరిస్తోంది.

చంద్రుడు గుండ్రంగా తిరిగి తన రెండు కాళ్లూ పెద్దక్క నడుంమీద వేశాడు. ఆ కాళ్లు పక్కకి నెట్టకుండానే ఆలోచిస్తూ పడుక్కుంది సుగుణ. ●



# అనగనగా...

(24వ పేజీ తరువాయి)

'రామ్మూర్తిగారూ! 'క్షమించాలి' అని ఒకమాట అన్నంతమాత్రాన మీ బాధ్యత తీరిపోయిందా? నాకు అక్కడ యెన్నో ముఖ్యమైన పనులు ఉన్నాయి. అయినా 'రామ్మూర్తిగారు చాలా పెద్దమనుషులు. అనుకున్న డబ్బు వెళ్ళగానే యిచ్చి వేస్తారు' అని మా అన్నగారు యెంతగానో చెప్పడం వలన నేను యిక్కడకు రావలసి వచ్చింది. మీరుమాత్రం డబ్బు యివ్వకుండా క్షమాపణలుమాత్రం చెబుతున్నారు. నేను యిక్కడకు రావడంవలన నా పనులు యెన్నో చెడిపోయాయి. దానికి యెవరు బాధ్యులు?

మీరు అసలు డబ్బు యిచ్చే స్థితిలో లేనప్పుడు, డబ్బు యిస్తానని మీరు ఎందుకు చెప్పాలి? డబ్బు యిమ్మనమని మేం మిమ్మల్ని యేమీ బలవంతం చెయ్యలేదు. అక్కడ పెద్ద కుటుంబాలవాళ్ళు యెంతో మది డబ్బు పుచ్చుకొని మా సంబంధం కోసం మా యిళ్ళచుట్టూ తిరుగుతున్నారు. ఈ మూడువేలరూపాయలు మాకు ఎవ్వరూ యివ్వనందువలన మీ సంబంధంకోసం వచ్చే మనుకొన్నారా?

'మీ కుటుంబం చాలా సాంప్రదాయం కల కుటుంబం మీరు యెంతో పెద్ద మనుషులు అన్నమాటకు నిలబడతారు' అని మా బావగారు యెంతగానో చెప్పడంవలన ఆయన మాటలను నమ్మి మీ సంబంధానికి అంగీకరించాము. కాని మీ పెద్దమనిషితనం మాట ఏలకద యిప్పుడే తేలిపోయాయి' అని శేషాచలం తనకు రామ్మూర్తి మీద కలిగిన కోపాన్నంతటినీ ఒక్కసారిగా వెళ్ళగక్కేశాడు.

శేషాచలం అన్నమాట లన్నింటినీ రామ్మూర్తి అలాగే తలవంచుకొని, వింటూ ఊరుకున్నాడేగాని ఒక్కదానికీ అతను సమాధానం యివ్వలేదు.

'ఏమండీ! బావగారూ! మీరు యింత వరకూ రామ్మూర్తిగారిని పొగుడుతున్నారు కదా! ఇప్పుడు దీనికి యేమిటి అంటారు?' అని శేషాచలం శివరావును అడగడం ప్రారంభించాడు.

వెంటనే రామ్మూర్తి 'శేషాచలంగారూ! ఈ విషయంలో తప్పు అంతా నాది.


ISI

ట్రిల్ సిరాతో

ఏ కలమైనా మంచిదే

తయారు చేయువారు:
ఇండస్ట్రియల్ రిసెర్చి కార్పొరేషన్
మద్రాసు-41 మరియు బెంగుళూరు-3

ADWAVE-IRC-3 TE

శాలోఫెన్

బాధానివారిణి మాత్రలు

అమృతాంజన్ లిమిటెడ్ వారి తయారింపు

తలనొప్పి, ఫ్లూను వెంటనే నిలిపివేయండి!
పంటినొప్పి, ఒళ్లునొప్పులని కూడా
వెంటనే పోగొట్టండి!

బజారులోకి తాజాగా వచ్చిన
శాలోఫెన్ మాత్రలలోని
ఔషధాలు డాక్టర్లు
సిఫార్సు చేసేవే.

శాలోఫెన్ ఉన్నచోట
బాధ ఉండదు.






FDSAS-1809 TE

అందులో శివరావుగారి తప్పు యేమీలేదు. మీరు నన్ను యెంత దూషించినా, నేను భరిస్తాను. కాని నామూలంగా శివరావు గారిని మాత్రం యేమీ అనవద్దు' అన్నాడు

రామ్మూర్తిగారూ! 'జరిగిపోయిన దాంట్లో తప్పు యెవరిది?' అని ఇప్పుడు ఆలోచించడం అనవసరం. శేషాచలానికి వయస్సు తక్కువ. జీవితంలో ఉండే కష్టసుఖాలు అతనికి తెలియవు. అందుచేత అతను తాత్కాలికోద్రేకం కొద్దీ యేదో అన్నాడు. దానిని గురించి మీరు అంతగా పట్టించుకోనక్కరలేదు. ఇక జరగవలసిన దానిని గురించి నేను ఒకమాట చెబుతాను' అన్నాడు శివరావు.

శివరావు చెప్పబోయే మాట యేమిటా అని అందరూ అతని ముఖంవైపు ఆత్రుతగా చూశారు.

'మా బావగారి అబ్బాయి యింకా ఒక సంవత్సరంపాటు చదవవలసి ఉంది. దీనికి అయ్యే ఖర్చు నిమిత్తమే కదా, మిమ్మల్ని మూడువేల రూపాయలు యిమ్మనమని అడిగాను. అంటే మొత్తం మూడువేలరూపాయలూ యిప్పుడే అవసరంలేదు. సంవత్సరం

# అనగనగా...

మొత్తంలో మీరు మూడువేల రూపాయలూ యిస్తే చాలు. అందుచేత మీరు ప్రస్తుతం ఒక వెయ్యిరూపాయలు యిచ్చినట్లయితే అతను రేపటిదినం కట్టవలసిన కాలేజీ ఫీజుకు మిగిలిన ఖర్చులకు సరిపోతుంది. తరువాత ఒకటిరెండు నెలల్లో మిగిలిన డబ్బు మీరు సర్దవచ్చును. ఈ విషయం మా బావగారికి నేను యెలాగో నచ్చచెబుతాను. మనందరకూ వచ్చిన సంబంధం మధ్యలో యిలాగ తెగిపోవడం యిష్టంలేక నేను ఈ మాట చెబుతున్నాను. తరువాత మీ యిష్టం' అని అంటూ శివరావు ఒక మధ్యేమార్గాన్ని సూచించాడు.

రామ్మూర్తికి ఆశ మళ్ళా కొంచెం చిగురించింది.

'శివరావుగారూ! మీ దయకు చాలా సంతోషం. వెయ్యిరూపాయలు యిచ్చే విషయం మీకు యిప్పుడే ఒక నిముషంలో చెబుతాను' అని రామ్మూర్తి శివరావుతో చెప్పి మళ్ళా ప్రసాద్ గదిలోనికి వెళ్ళాడు.

శాంతకూడా రామ్మూర్తితోపాటే ఆ గదిలోనికి వెళ్ళింది.




రామ్మూర్తి వెళ్ళేసరికి ప్రసాద్, కాంచన నిలబడి యేదో మాట్లాడుకొంటున్నారు. వారు రామ్మూర్తిని చూడగానే తమ సంభాషణ ఆపివేశారు

'బాబూ! అయిదువేలూ నువ్వు తీసుకొంటే, తీసుకొన్నావు. దానిని గురించి నేను అడగడంలేదు బాబూ! ఒక్క వెయ్యి రూపాయలకు చీటి యిచ్చి, నన్ను ఈ ఆపద నుంచి కాపాడు' అని అంటూ రామ్మూర్తి మళ్ళా ప్రాధేయపడ్డాడు.

రామ్మూర్తి అంటున్న 'చీటి' యేమిటో ప్రసాదుకు అర్థం కాలేదు. అందుచేత అతను 'చీటి యేమిటి?' అని తండ్రిని ప్రశ్నించాడు.

'ఒక వెయ్యిరూపాయలు తిరిగి యిమ్మనమని పాపయ్యగారికి నువ్వు ఒక చీటి రాసి యియ్యి. ఆ చీటి తీసుకొని వెళ్ళి, ఆయన కాళ్ళమీదపడి అయినాసరే, ఆ వెయ్యి రూపాయలు తెచ్చి శేషాచలంగారికి యిస్తాను. మిగతా డబ్బు విషయంలో నిన్ను ఒక్క పైసా అయినా అడగను. బాబూ! ఈ ఒక్క వెయ్యిరూపాయలకు పాపయ్యగారికి చీటి యియ్యి' అని రామ్మూర్తి మరింత దీనంగా అడిగాడు.

ఎటువంటివానికైనా జాలి కలిగించే విధంగా రామ్మూర్తి అంటున్న మాటలకు ప్రసాద్ లొంగిపోతాడేమోనని కాంచన భయపడింది. అందుచేత తను మధ్యలో జోక్యం చేసికొంది.

'ఆ అయిదువేల రూపాయలూ సొంతం కొనమని మా బాబయ్యగారికి యిచ్చారు. అందులోనుంచి ఒక్క పైసా అయినా, తిరిగి యివ్వడానికి వీలులేదు' అని ఖచ్చితంగా అన్నది కాంచన.

'బాబూ! నువ్వు చెప్పేది కూడా అంతేనా!' అని ప్రసాదుకు మరింత దగ్గరగా వెళ్ళి అతన్ని ప్రశ్నించాడు రామ్మూర్తి.

'నేను చెపితే ఒకటీ, ఆయన చెపితే ఒకటీనా? మా యిద్దరమధ్యా తగాదాలు కల్పించడానికి ప్రయత్నిస్తున్నారా?' అని విసురుగా అన్నది కాంచన.

ఆ మాటలతో రామ్మూర్తికి చాలా కోపం వచ్చింది. అయినా అతను తన కోపాన్ని చాలవరకు అణచుకొన్నాడు.

'అమ్మాయ్! నేను నా కొడుకుతో మాట్లాడుతున్నాను. మధ్యలో నీ జోక్యం

అనవసరం' అని రామ్మూర్తి కూడా కొంచెం తీవ్రంగానే అన్నాడు.

దానితో కాంచన యింకేమీ మాట్లాడ లేకపోయింది.

'బాబూ! నిన్ను నేను యేమీ నిర్బంధించడంలేదు. నిన్ను కన్నతండ్రిగా అడుగుతున్నాను. ఇంతవరకూ యెప్పుడూ నిన్ను యేదీ అడగలేదు. ఇకముందుకూడా నిన్ను యేదీ అడగను. ఇప్పుడుమాత్రం ఒక్క వెయ్యిరూపాయలు యిమ్మనమని నీ చేతులు పట్టుకొని బ్రతిమాలుతున్నాను' అని అంటూ రామ్మూర్తి ప్రసాద్ చేతులు పట్టుకొన్నాడు.

'బాబూ! మీ చిన్నప్పటినుంచీ నేనూ, మీ నాన్నగారూ, మిమ్మల్ని యెంత అల్లారుముద్దుగా పెంచామో నీకే తెలుసు. మీకు యేలోటూ కలగకుండా చేయడానికి మేము యెంత ప్రయత్నం చేశామో కూడా నీకు తెలుసును. నిన్ను కని పెంచి పెద్దచేసిన తల్లిదండ్రులకు ఒక వెయ్యిరూపాయలు యివ్వనంటావా బాబూ?' అని శాంతకూడా ప్రసాదును బ్రతిమాలింది.

ప్రసాద్ మెల్లగా తండ్రిచేతుల్లోనుంచి తన చేతులు తప్పించుకొని దూరంగావెళ్ళి నిలబడ్డాడు.

'అందరిలాగే కన్నారు. కన్నారు కాబట్టి పెంచారు. ఇందులో మీరు ప్రత్యేకంగా యిప్పుడు చెప్పవలసినది యేమీ లేదు. ఆ అయిదువేలరూపాయలు నా వాటా. అందులో డబ్బు తిరిగి యివ్వడానికి వీల్లేదు' అన్నాడు ప్రసాద్ యేమీ సంకోచించకుండా.

అంతవరకు రామ్మూర్తి తనలోనే అణచుకొన్న కోపం ఒక్కసారిగా కట్టలు తెంచుకొంది.

'ఛీ! దుర్మార్గుడా! నీకు వాటా యేమిటి? తండ్రిని ఈవిధంగా చిత్రవధ చేస్తున్న రాక్షసునికా తండ్రి ఆస్తిలో వాటా? మేము చేసిన పుణ్యానికి ఫలితంగా నువ్వు పుట్టావని నీకు 'ప్రసాద్' అని పేరు పెట్టాం కాని మేము యెన్నో జన్మల్లో చేసిన పాపాలకు ప్రతిఫలంగా నువ్వు పుట్టావని, నువ్వు భూలోకంలోనే మమ్మల్ని నరక యాతనలకు గురిచేస్తావని మేము అప్పుడు ఊహించలేకపోయాం పగవాళ్ళకు కూడా నీవంటి కొడుకు పుట్టకూడదు...




ఇ.యస్.ఆర్.కె.ప్రసాద్

ఎకు పంక్చర్ అనేది అనాదిగా చైనా దేశంలో పాటిస్తున్న ఒక వైద్యవిధానము. దీనిని ఒక నిర్దిష్టమైన శాస్త్రంగా పరిగణించనప్పటికీ దీనివలన అనేక రకాల జబ్బులు నయమవుతాయనేది నిజం. దీని విశిష్టత యీమధ్యనే పశ్చిమ దేశాలచే, ముఖ్యంగా అమెరికాచే గుర్తించబడింది. కీళ్ళనొప్పులు, తలనొప్పి, ఉన్మాదము, నపుంసకత్వము, ఒకటేమిటి అనేక రకాల జబ్బులకు యీ వైద్యం బ్రహ్మాండముగా పనిచేస్తుందని తెలుస్తున్నది. మన దేశంలోకూడా యీ రకం వైద్యం చేసే వాళ్ళున్నారు పారిస్‌లో దాదాపు 50 మంది వైద్యులు యీ పద్ధతిని అవలంబిస్తున్నారంటే, దీని ప్రాశస్త్యం వారినెంతగా ఆకర్షించిందో ఊహించవచ్చును అయినప్పటికి ఆయాదేశాల్లో దీనిని గురించిన విమర్శ తపోలేదు అందువలన యీ వైద్యంలో నమ్మికగల వైద్యులు ఎన్నిక చేయబడిన కొందరు రోగులపై యీ పద్ధతిని ప్రయోగించి చూస్తున్నారు

యీ వైద్యవిధానంలో రోగి శరీరంపై నిర్దిష్టస్థానాల్లో సన్నని సూదులను గుచ్చుతారు అలా సూదులను గుచ్చే ప్రత్యేకస్థానాలు ఎకుపంక్చర్ శాస్త్ర ప్రకారం మానవశరీరంలో దాదాపు 365 వున్నాయి. మనదేహంలో విద్యుత్తు ముఖ్యంగా 12మార్గాల్లో ప్రవహిస్తుందని, పైన చెప్పిన 365 స్థానాలు యీ మార్గాల్లో అమర్చబడివుంటాయని యీ శాస్త్రం చెబుతుంది

దేహంలో కొన్ని ప్రాంతాల్లో సూదులను గుచ్చినట్లయితే శరీర ఉపరితలములోని నాడులనుండి, నొప్పిని సూచించే నాడీ వార్తలు వెన్నుపాముకి, ఆపైన మెదడుకి చేరవనిగాని, లేదా అలా గుచ్చడంవల్ల మెదడులో అట్టి వార్తలను గ్రహించే భాగం పని చేయడం మానివేస్తుందనిగాని యీ వైద్యులు భావిస్తున్నారు. శరీరములో అనేకమైన 'నాడీవలయాలు' వున్నాయి కాబట్టి ఒకచోట సూదిని గుచ్చితే వేరొక చోట నొప్పిగాని, యింకేదైనా వ్యాధిగాని నయమవుతుందని వీరు అంటారు.

మత్తుమందుల సహాయం లేకుండా ఎకుపంక్చర్ ద్వారా మనిషికి మత్తును కలిగించి పెద్ద పెద్ద ఆపరేషన్లనుకూడా చేయవచ్చును. యిట్టి ఆపరేషన్లు కొన్ని యీ మధ్యనే అమెరికాలో విజయవంతంగా జరిగాయి. ఆపరేషను జరిగేటపుడు రోగి మేలుకొని, ఉల్లాసంగా వుంటాడు; నొప్పి ఏమాత్రం తెలియదు. కొన్నిదేశాల ప్రభుత్వాలు ఎకుపంక్చర్ గురించి మరింతగా పరిశోధనలను చేయాలనే సంకల్పముతో వున్నాయి.

ఏది ఏమయినా యిది చాలా జాగ్రత్తతో కూడుకొన్న పని. సూదులను శరీరంలో గుచ్చేటపుడు అవి పెద్ద రక్తనాళాలకు, నాడులకు హానిని కలిగించవచ్చును. అందువలననే చైనాలో యీ వైద్యానికి కూడా ఏళ్ళతరబడి తరిఫీదు వుంటుంది. ఒంట్లో సూదులు గుచ్చితే జబ్బులు నయమవుతాయనేది ఎనటానికి ఆశ్చర్యంగానే వుంటుంది



దీర్ఘ రోగులకు
ఉత్తమ వైద్యము

పుంసకత్వము, శుక్ల నష్టము, స్వప్నదోషము(?), స్త్రీ ప్రయోగము, అసంతృప్తి, ఉబ్బసము, (దమ్ము), బోధ కాళ్లు, చెవుడు, కడుపునొప్పి, కుష్టు, చర్మ వ్యాధులకు పోస్టలు ద్వారాకూడా వైద్యము చేయబడును.

శ్రీ బాలాజీ వైద్యశాల, డా: పి. కుమారస్వామి
దేవర. ఎ. బి. రోడ్, తెనాలి. ఫోన్ · 551.
బ్రాంచి 9—డి, శివాజీ స్ట్రీట్, మద్రాసు—17.



35సం॥ అనుభవం
వరిబీజము బుడ్డలు బీజకుటు
మొదలగు వ్యాధులకు ఆపరేషన్
లేకుండా గ్యారంటిగా బాగుచేయబడును
రావు అండ్ రావు ఆసుపత్రి
గౌలిగూడ సిటి బస్ డిపో ఎదురు,
రామ్ మందిర్ రోడ్, హైదరాబాద్-12 ఆ.ప్ర
ఆఫీస్ ఫోన్: 42870 ఇంటి ఫోన్: 38544.



ధరించడానికి
తగినవస్త్రాలు?



ట్విన్ టస్కర్
డ్రిల్ లు · పాప్లిన్ లు · గాబర్డీన్ లు
టస్సూర్ లు మొదలైనవి



మధుర మిల్స్
మధురై, దక్షిణ ఇండియా

Sonsons-1841 B-TEL


# అనగనగా...

అసలు పొలం తనఖా పెట్టిన పదిహేను వేల రూపాయల్లో ఒక్క పైసాకూడా నేను కాని నా భార్యకాని వాడుకోలేదు. ఆ డబ్బు అంతా మీరు పుట్టినప్పుడు అయిన ఖర్చులకు, మీకు చేయించిన వైద్యాలకు, మీ చదువులకే ఖర్చు అయిపోయింది. అందుచేత నా వాటాకే ఆ డబ్బు రావలసి ఉంది. ఆ డబ్బు తిరిగి తెస్తావా? లేదా?' అని గర్జిస్తూ, రామ్మూర్తి ప్రసాద్ దగ్గరకు వేగంగా వెళ్ళబోయాడు.

ఆ వేగంలో రామ్మూర్తి పట్టుకొన్న ఊతకర్ర జారిపోయింది. రామ్మూర్తి పడిపోబోయాడు. ఇదంతా చూస్తూ నిలబడ్డ శాంత కటాలున 'ఏమండీ!' అని అంటూ అతను పడిపోకుండా పట్టుకొంది.

ఆ సమయంలోనే లక్ష్మి 'నాన్నా! నాన్నా!' అని అంటూ ఆ గదిలోనికి వచ్చింది.

'నువ్వు యిక్కడకు యెందుకు వచ్చావు?' అని శాంత లక్ష్మిని కసిరింది.

లక్ష్మి యేమీ మాట్లాడకుండా తండ్రి దగ్గరకు వెళ్ళి అతని చెయ్యి పట్టుకొంది.

'పదండి! బయటకు వెళ్ళిపోదాం' అని అంటూ శాంత రామ్మూర్తి చెయ్యి పట్టుకొంది.

రామ్మూర్తి యింకో చెయ్యి లక్ష్మి భుజంమీద వేసుకొని మెల్లగా గది బయటకు వచ్చివేశాడు.

రామ్మూర్తి వేసిన కేకలకు ప్రసాద్ నిజంగా భయపడ్డాడు. కాని తన భయం బయటపడినట్లయితే, భార్యకు లోకువ అయిపోతాననే అభిప్రాయంతో అతను యేమీ మాట్లాడకుండా ఉండిపోయాడు.

ప్రసాద్ గదినుండి రామ్మూర్తి బయటకు వచ్చి, చూసేసరికి శివరావు, శేషాచలం కూర్చున్న కుర్చీలు ఖాళీగా ఉన్నాయి.

'ప్రస్తుతం ఒక వెయ్యిరూపాయలు యిస్తే చాలును. మిగిలిన డబ్బు తరువాత యివ్వవచ్చును ఈ విషయం నేను మా బావగారికి నచ్చచెబుతాను' అని శివరావు అంతకుముందు రామ్మూర్తితో అన్నాడు. ఆ మాటమీదనే రామ్మూర్తి కొడుకును వెయ్యిరూపాయలైనా అడుగుదామని కొడుకు గదిలోకి వెళ్ళాడు.

ఆ వెంటనే శివరావుకు యింకో ఆలోచన వచ్చింది. తాను చెప్పిన ప్రకారం రామ్మూర్తి అప్పటికి వెయ్యిరూపాయలు యివ్వవచ్చును కాని మిగిలిన డబ్బు తరువాత యివ్వలేకపోతే, వెంకట్రావుకు తను సమాధానం చెప్పవలసి ఉంటుంది. తను అనవసరంగా యీ బాధ్యత వహించడం యెందుకు? 'అంత్య నిష్ఠూరంకంటే ఆది నిష్ఠూరం మేలు' అని తరువాత శివరావు తనలో అనుకున్నాడు.

కొంచెంసేపు అయిన తరువాత శేషాచలం 'బావగారూ! మనం వెళ్ళిపోదామా?' అని శివరావును ప్రశ్నించాడు.

అటువంటి అవకాశమే యెదురు చూస్తున్న శివరావు 'సరే, నీ యిష్టం' అన్నాడు.

ఇద్దరూ వెళ్ళిపోయారు.

శివరావూ, శేషాచలం తనతో చెప్పకుండా అలాగ వెళ్ళిపోవడం రామ్మూర్తికి మరింత బాధనుగాని, ఆశ్చర్యాన్నిగాని కలిగించలేదు. వారు యింకా అక్కడ ఉన్నట్లయితే, శేషాచలం యింకా నిష్ఠూరంగా మాట్లాడడం తాను వారికి క్షమాపణలు చెప్పుకోవడం తప్ప అదనంగా జరిగేది యేమీ లేదు.

శాంత రామ్మూర్తి చెయ్యి పట్టుకొని మెల్లగా తీసికొనివచ్చి అతని కుర్చీలో కూర్చోపెట్టింది.

'ఇంకా యీ నిర్భాగ్యుడితో మాట్లాడడం యెందుకు?' అని శివరావుగారు శేషాచలంగారు వెళ్ళిపోయుంటారు' అని తనలో తాను అనుకొన్నట్లుగా పైకి అన్నాడు

'నాకు ముఖం తిరుగుతూ ఉంది' అని అంటూ శాంత పడిపోబోయింది.

ఆమెకు కొంచెం దూరంలోనే నిలబడి ఉన్న లక్ష్మి 'అమ్మా! అమ్మా!' అని అంటూ ఆమెను పట్టుకొంది.

'శాంతా! శాంతా! యెలాగ ఉంది?' అని అంటూ రామ్మూర్తి కూడా లేచి శాంతను పట్టుకున్నాడు

శాంత యేమీ మాట్లాడలేదు.

రామ్మూర్తి, లక్ష్మి యిద్దరూ కలిసి ఆమెను పట్టుకొని చావిట్లోనే ఉన్న మంచంమీద పడుకోబెట్టారు.

(ఇంకా వుంది)



















ఈ కార్టూన్ నీతి *

సినిమాలో దేవుణ్ని తిట్టు! స్త్రీని అర్ధనగ్నంగా చూపించు!! 'ఎ' సర్టిఫికెట్ అయినా ఇస్తారు! మంత్రులను విమర్శించావా ఏ సర్టిఫికెట్టూ రాదు!

*

గీతా—

# అనామధేయుడి ఆత్మకథ

## సీరియస్‌లెస్ హాస్యరచన — ఆర్వియ

## 18

'ఇదేం పద్యం రా బాబూ ?' అన్నాడు మా తాత.

'ఇది పద్యం కాని పద్యం' అన్నాన్నేను.

'అదేమి ట్రోయ్ ? ఎన్నోపేర్లు విన్నాను. పద్యం, వృత్తం, జాతి, ఉపజాతి, గేయం. గీతం అంటూ. కాని, పద్యం కాని పద్యం అంటూ ఎక్కడా వినలేదు !'

'ఇప్పుడు వింటున్నావు...'

'యతిప్రాసలు యెత్తికట్టేవట్లే వున్నాయి ?'

'భావావిష్కరణకి సాధారణంగా యతి ప్రాసలు ప్రతిబంధకాలు. ఈ పద్యంలో అవి దుస్సాధ్యం. ఇందులో మొదటిపాదం ఉత్పలమాల. రెండోది చంపకమాల, మూడోది శార్దూలం, నాల్గోది మత్తేభం!'

'నాలుగు వృత్తాల పాదాలు కలగా పులగం చేసి ఏడవకపోతే — ఏదో ఒక వృత్తంలో యేకంగా ఏడవరాదూ ?'

'మార్పు కావాలి. పాత ఛందస్సు స్థానే నేను సరికొత్త ఛందస్సు సృష్టిస్తున్నాను. పూర్వులేగదూ చెప్పేరు : 'నిరంకుశాః కవయః' దీన్నిబట్టి ఆ కాలం లోనే నిరంకుశు లున్నట్లు తెలుస్తూంది ఇప్పటివాళ్ళు మరీ నిరంకుశులు. నిరంకుశుడైన కవి తనకి నచ్చిన ఛందస్సు కూర్చుకుంటాడు. లేకపోతే ఛందస్సుని తోసి రాజు చేసేసి తన కిష్టమైన పంథాలో విహరిస్తాడు. విమర్శకుడు సహృదయుడు అయితే ఆస్వాదించడం. లేకపోతే, చాటుగా మొత్తుకోవడం. అంతేకాని, అదేమిటి? — ఇదేమిటి ? — అని అడగడానికి హక్కు లేదు... ఇప్పుడు ప్రతి వ్యవస్థలోనూ మార్పు వచ్చింది. రావాలి లేకపోతే మార్పు తేవాలి. పురాతన ఛాందస శాసనాలన్నీ ఖండించి పారేయాలి!'

నేనిలా వాదించేసరికి మా తాతగారు గాభరా ఎత్తిపోయేడు.

'ఒరే, అబ్బీ! అదిసరేగాని— స్త్రీ 'కీరవాణి' 'భ్రమరవేణి' అన్నారు కాని 'మయూరవాణి' 'ఖరవాలవేణి' అని యింత వరకూ ఏ కావ్యంలోనూ ఎవరూ అనలేదు.'

'అందుచేతనే — మనం యిప్పుడు అంటున్నాం. 'కీరవాణి' అని ఒకరు పొరపాటున అంటే మరొకరు 'శుకవాణి' అన్నారు. అలవాటు చొప్పున 'భ్రమరవేణి' అని మరొకరు అంటే, ఇంకరు 'అళినీలాక' అని ఆ 'కవిసమయాలనే' మార్చి మార్చి, కూర్చి కూర్చి, పేర్చి పేర్చి నిస్సారంగా— నిర్జీవంగా చేసి పారేశారు. కనుక మనం కొత్త కొత్త కవిసమయాలను సృష్టించేం. ఇవే భావితరాలవారికి మార్గదర్శకాలవుతాయి...'

'అంటే పద్యం కాని పద్యంలో స్త్రీ కాని స్త్రీ వర్ణన అన్నమాట!'

'మెల్లిగా అంటావేం ?'

'...పోనీగాని, విషయానికీ శీర్షికకీ యేమేనా సంబంధం వుందీ? సరే విషయంలో నీకూ నాకూ భేదాభిప్రాయం వుంది. వర్ణింపబడ్డది 'ఆడదే' అని అంటావు నువ్వు. 'గాడిద' అంటాను నేను... ఈ వర్ణనీయ వస్తువుకీ, 'రాజహంస' అన్న శీర్షికకీ యేలా సమన్వయం? స్త్రీ పర్యాయపదంగా 'రాజహంస' అన్నావేమో అంటే 'పూర్వకవి సమయాల్ని' అంగీకరించలేదంటావు. 'ఉన్మత్తాశ్వద్రుతయాన'కీ 'రాజహంస'కీ పొత్తు కుదరదే!?'

'అంత ఆలోచించడానికి నాకు టైము లేదు. శీర్షిక ఆకర్షణీయంగా వుంటూ, పాఠకులికి హర్షవర్షం కురిపించాలి. అంతే!'

'అయితే, విషయానికి శీర్షికకి ఏమీ సంబంధం వుండక్కర్లేదు.'

'అక్కర్లేదు.'

'బాగుంది భేష్ ... మహాబాగుంది ! విషయమేమైనప్పటికి 'జ్యోత్స్న' అనో, 'మధూళిక' అనో, 'ప్రాచీమరీచిక' అనో శీర్షికలుంటే చాలంటావు!'

'ఇప్పుడంతా అలాంటి శీర్షికలే పెడుతున్నారు తాతా.'

'అభ్యుదయం, ప్రగతి ఇలాగ వెర్రితలలు వేస్తోందన్నమాట. అందులో ఒకపాదం ఇందులో ఒకపాదం కలిపి ఒకమార్పు. ఆ పాదాన్ని మూడుముక్కలూ నాలుగు చెక్కలూ చెయ్యడం మరొకమార్పు కవిసంకేతాల్ని తారుమారు చేసి గందరగోళంలో ముంచడం 'మరొకమార్పు. ఉన్న యతి ప్రాసల్ని వూడపీకెయ్యడం ఇంకో మార్పు. అసంబద్ధమైన శీర్షికలు పెట్టడం మరో పెద్దమార్పు. ఇంతవరకూ చెయ్యనిమార్పు ఒకటుంది, అది చెయ్యడానికి ఏ మహానుభావుడైనా పూనుకొంటే బాగుండును...'

'ఏమిటది ?'

'అక్షరాలలో మార్పు. 'ఆ' అంటే 'కా'—'వ' అంటే 'ట'—ఇదొక మార్పు, 'కై' అంటే 'కీ'—మరో మార్పు—'ఓ'

అంటే 'ఏ'... ఇలాగ భాషలో యెన్నేనా మార్పులు చెయ్యవచ్చు. దానికి ఎందుకు పూనుకోరా అని ఆలోచిస్తున్నాను... ఇదంతా 'మార్పుకోసం'. నీ పద్యానికి 'మార్పుకోసం' అన్న శీర్షిక పెడితే అందంగా వుంటుంది.'

'ఔను. బాగా చెప్పేవు, ఆ శీర్షిక బాగుంది. 'జ్యోత్స్న' అని ఇందాక ఏవేవో చెప్పావు..మళ్లా చెప్పు తాతా, రాసుకుంటాను. ముందుముందు రచనలకి పనికి వస్తాయి...' అన్నాను కాగితం, కలం తీసుకొంటూ.

'అవెందుకు నాయనా, అంతకన్నా మంచివే చెప్తాను రాసుకో!'

'థేంక్స్'.

'విను. 'అరుణారుణ కిరణ తోరణం'— 'కాలకూట పయోమృతం'—'

'ఉండుండు. రాసుకోనీ—'

'...'వెన్నెల వసంత నీరాజనం''

'ఇదేమిటి, దుష్టసమాసం లాగుంది. 'వెన్నెల' దేశ్యం, 'వసంతం' సంస్కృతం లాగుంది.'

'ఆకర్షణీయంగా వుండడం ప్రధానం. తదితరం అప్రధానం. పూర్వ కవి ప్రయోగాలు చాలా వున్నాయి. 'శుభవేళ' 'శుద్ధ తప్పు' ఎట్సెట్రా...'

'అయిసీ! 'వెన్నెల వసంత నీరాజనం' అన్న శీర్షికపెట్టి నల్లని చీకటి గోరోజనాన్ని వర్ణించి పారేస్తాను.'

'కింశుక కిశోరం'

'పస్టు. మర్కటకిశోరం—లావుంది.'

'...'అభిష్వంగహేల'—'పుష్పవిష్కరణ భాష్పం'—'నీరవనిర్నిద్ర నిర్వచ్చరం'—'

'భలేభలే—ఉండుండు—రాయనీ!'

'ధ్వాంతాధ్వాంతము'—'శాద్వల సౌరభం' —'మూర్ఛామూర్ఛన'—'అళికుల విరాళి'

'ఉండోయ్ తాతా, ఏం శీర్షికలు...వామిరంగ!'

'...శ్మశ్రులావణ్యం'—'హేవాకస్మితం'—'తమో విభావరీ రోచిస్సు''

'తమో విభావరీ రోచిస్సు — యేమిటి తాతా? తమో అంటే చీకటి, విభావరి అనగా రాత్రి, రోచిస్సు అంటే వెలుగు. చీకటి రాత్రిలో వెలుగు— ఏమిటి? నాకేం అర్థం కావటం లేదు!'

'మిగిలినవన్నీ నీ కర్థం అయ్యాయా?—ఏమిటి? ఇదొకటి అర్థం కావడానికి? అర్థం యెందుకోయ్, ఆకర్షణీయంగా కనిపిస్తే చాలదూ?—'నీవు చెప్పినవిద్యయే...!'

'చుట్టూ తిరిగి నామీదే పడ్డావూ?'

'ఇలాంటి అధ్వాన్నపు కవిత్వం రాయకపోతే యేం? విషయచమత్కారం వుండాలి గాని, శీర్షికలోనీ, పాదాలు విరగ్గొట్టడంలో యేముంది?'

ఆ రోజుకి గోష్ఠి చాలించాం.

*

ఆ మర్నాటి ఉదయం కూడా మళ్లీ మా గోష్ఠి ప్రారంభము అయింది. మా తాతకి నేను రాసిన పద్యాన్నొకదాన్ని వినిపించాను:

'కులుకుల బిత్తరీ!—
అలరు గుత్తిసరీ!—
పంజెయల్ జిలుకు జవాహిరీ!—
వలపు చిందు సిరీ!—
విరజల్లు నల్లరీ!
తళుకుల లాహిరీ!
నవులు తాల్చు విరీ!
బతిమాలుకొందు
మేల్ బెళుకుల బేసరీ!—
మెడకురీ—
మవె నాకు గురీ—
సరీ!—సరీ!—!!'

మహొకటి కూడా చూపించేమ:

'లేడివలె జలదృక్కులు...
పైడి యనందగిన మేలివన్నెయు గరి
వై లేడీ!— అరబాడీ!— ఫూబోడీ—!
నావలెను మాడు
పురుషుండెడీ!—'
'ఆఫీసుకి వేళైందే—
ఏపాపమెగాని—
ఇంత యేడవ్వేమే?—
కాఫీయేనా తగడు...
ఆ షైళ్లి జ్వాలలోనె అణగారాలే—!!'

'బాగానే వున్నాయి పద్యాలు — గేయాల్లాగ! కాని, ఆ చుక్కలూ గీతలూ ఏమిట్రా బాబూ?' అన్నాడు మా తాత.

'అదొక టెక్నిక్కు. పద్యాలు ఆకర్షణీయంగా కనబడడానికి' అన్నాను నేను, మా తాత తెలివితక్కువకి జాలిపడ్తూ.

'అంటే పద్యాల్లో వున్న లోట్లు గణభంగం, యతిభంగం, భావదారిద్ర్యం, భాషాహైన్యతా, మొదలైనవి ఈ చుక్కలు గీతల్లో కప్పుకొనిపోతాయి. అంతేనా? పద్యాన్ని యథాతథంగా చూపించి ఆకర్షించడానికి ధైర్యం చాలదు. చాలా గొప్ప టెక్కునిక్కు! టక్కు టమార గిజ గోకర్ణవిద్య—'

'ధైర్యం చాలకేం?— మార్పు...'

'ఔనౌను. మార్పు కావాలి. అది చాలా ముఖ్యం. శబ్దాలంకారం, అర్థాలంకారం, భావప్రౌఢీ, భాషా పుష్కలతా, శైలీ మనోజ్ఞతా, శయ్యారమ్యతా — ఇవి అప్రధానాలు...ఏం?'

'ఇవన్నీ వుంటేగాని కవిత్వం కాదా, ఏమిటి?'

'కాదు.'

'మరి— కవిత్వం అంటే పద్యాలు కావా?'

'ఔను.'

'మరి— పద్యాలల్లితే కవిత్వమవదా, ఏం?'

'అవదు.'

'అదేమిటి?'

'అదే పొరపాటు. పద్యం ఒక శరీరం లాంటిది. దానికి ప్రాణం రసం. ఆ రసానికి— ఆధారాభూతాలూ, ఆలంబనాలూ— పైని చెప్పిన శబ్దాలంకారాది సామగ్రి. ప్రాణం లేని శరీరాన్ని ఎలాగ 'మనిషి' అనలేమో— అలాగే రసం లేని పద్యాన్ని కవిత్వం అనలేం. యదార్థాన్ని ఊహా చమత్కృతితో మేళవించి, సహృదయ రంజకంగా, ఛందోబద్ధంగా చెప్పే కళా నైపుణ్యమే కవిత్వం. సహృదయరంజకం కావడానికి, ముఖ్యంగా కవికి — రసోత్పత్తి చేయగలిగే ప్రతిభా, వ్యుత్పత్తీ, రచనా వైదుష్యం వుండాలి.'

'ఔను. గాని అంత పాండిత్యం వెలగబెడితే కవులు ప్రజలకి సన్నిహితులు కాలేరు. అర్థం చేసుకోనూ లేరు.'

'ప్రజాసామాన్యానికి రాగజ్ఞానం లేదని— రాగతాళ లయ స్వరజ్ఞానం లేకుండా—సంగీతం వినిపించడం హాస్యాస్పదం. ఇంజనీరింగు చదవకుండా హర్మ్యాలు నిర్మించడం, డాక్టరీ చదవకుండా మాత్రలివ్వడంలాటిదే! కళ నియమబద్ధం. శాస్త్రపరిచయం లేని కళ నిర్జీవం. అందుచేత సాహిత్య కళాభివేశం ప్రజలకి కలిగించు. ఉత్తమ సాహిత్యం అందజెయ్యి. అది కవుల విధి. అంతేగాని, జంఘాలశాస్త్రి చెప్పినట్లు—

'బీరకాయ—వే—కూర చేయవే
రవపులుసు వేసి,
బీరకాయ—వే—కూర చేయవే—'అంటే

అది కవిత్వం కాదు. సంగీతం అంతకన్నా కాదు!' అన్నాడు మా తాత.

నేనేం మాట్లాడలేదు. 'పోనీ ఈపద్యం చూడు తాతా!' అన్నాను.

'బ్రతికినన్నాళ్ళును పాపాత్ముడైనను...
గత్రియుద్ధపగానె
'స్వర్గస్థుడు'— అగును—!

# అనామధేయుడి ...

ఉన్నదియున్నాపుడు పేదను సున్నమ్మైన...
చిత్రిని నెక్కనంతనే—...—
'కీర్తిశేషుడు'— అగును—!!
వచ్చు పొచ్చుగ సుఖములు
వచ్చినంత—
బ్రతికియుండిన సుఖములు పడయరాదు!!

... ... ...

... ... ...

... ... ...

మా తాత పుస్తకంలోంచి తలెత్తి నన్ను చూశాడు

'పద్యాలు బాగనే వున్నాయి. కాని, ఆఖరికి ఆ చుక్కలేమిటిరా బాబూ?' అని ఒక చొప్పకట్టలాంటి ప్రశ్న మా తాత వేశాడు. 'రామాయణమంతా విని సైంధవుడికి బకాసురుడు బావగారవుతాడా, బావమరది అవుతాడా?' అని అడిగినట్టు. కాని ఆ మాట పైకి అంటే ఇంకేమైనా వుందా?

'మానవుడియొక్క నిర్వేదాన్ని ఆ పద్యంలో అమోఘంగా వర్ణించి పారేసి తర్వాతి పద్యానికి, నిర్వేదాతిశయాన్ని, భావోద్వేగాన్ని వర్ణించడానికి ఇప్పటికి తెలుగు భాషలోవున్న పదాలు — తత్సమ, తద్భవ, దేశ్య, వ్యావహారిక, గ్రాంధిక, గ్రామ్య, విదేశ్య, సంకర, నానాగోత్రస్య— చాలక ఆ ఆవేగాన్ని చక్కని చుక్కల్తో సూచిస్తూ పాఠకుడి భావుకత్వానికి విడిచిపెట్టేను' అన్నాను.

'పాఠకుడి భావుకత్వానికి విడిచిపెడదా ఇన్ని నీళ్ళు ధారపోశావా? అసలు పద్యాలన్నీ పాఠకుడి భావుకత్వానికే విడిచిపెట్టే ఈ శ్రమ అయినా తప్పిపోయేది. ఎందుకొచ్చిన బాధ ఇదంతా?'

'నీ వెటకారం చాలించు. ఆ టెక్నిక్ నీకు యెంత బుర్రబద్దలు కొట్టుకున్నా అర్థం కాదు.'

'వద్దు. వద్దు, బుర్రబద్దలు కొట్టుకోకుండానే అర్థం అవక చస్తుంటే, బుర్రబద్దలు కొట్టుకుంటే మరి అర్థం అయి ఏడ్చేదేమిటి?'

'ఆ టెక్నిక్ ఏమిటంటే— ?'

'ఔన్లే. ఆ టెక్నిక్కూ, ఆటక్కుటమార గజగోకర్ణ విద్యలూ ... శబ్దశక్తీ, భాషావైదుష్యమ్మూ అంటే యేమిటో తెలీని వరడితే బువురికే తెలియాలి, పాకం తెలుస్తుంది? మాలాంటి పూర్వకాలం వాళ్ళం చేతకాకపోతే చేతగాదని ఊరుకుంటాం. కాని, కొందరు నవ్యులు లాగ, పోరాని పోకిళ్ళుపోయి మార్పు—అనీ, టెక్నిక్కు అనీ దబాయించం!' అన్నాడు మా తాత డంబంగా.

'మీ దృష్టి గతంమీద — మా దృష్టి భవిష్యత్తుమీద! మన చూపులు కలియవయ్యా!'

'ఓరి వెర్రివాడా, పునాదిలేని భవనం, వేరులేని చెట్టు, గతంలేని భవిష్యత్తు ఎక్కడివయ్యా?'

'సరే—అయితే నన్ను కవికోటిలో చేర్చనంటావు. పోని నేనే ఒక మంచిరోజు చూసుకొని ఏదో ఒకటి—'కవికుఃభూషణ' అనో— 'కవికులభీషణ' అనో, 'కవిరాజహంస' అనో, 'కవిరాజధ్వంస' అనో, 'కవినిర్ధూమధామ' అనో తగిలించేసుకుంటాను. అప్పుడేమంటావ్?' అని అక్కసుతో అన్నాను.

'భేషుగ్గా వుంది నీ అయిడియా?! ఈ కాలంలో అది రివాజేకదూ! ఒక సంగతి— బిరుదులమీద, సన్మానాలమీద, ప్రశంసలమీద పూలమాలలమీద, దుశ్శాలువలమీద, గజారోహణల మీద ఉన్న మోజులో సహస్రాంశం సాహిత్య వ్యవసాయ కృషిలో లేదంటాను— ఆఁ...శ్రీహరీ!' అంటూ మా తాత ఆవలించేడు.

ఆవలిస్తే నేను పేగులు లెక్కబెడ్తాను. మా తాతని నిద్రాదేవి తరుముకొని వస్తోందని నేను గ్రహించడానికి యెంతోసేపు పట్టలేదు. వెంటనే మా తాత అక్కడే నిద్రాదేవి ఒడిలో ఒరిగిపోయాడు. గోష్ఠి ఆరోజుకి ఇక అయిపోయింది ... మర్నాడు పుస్తకం తెరుద్దామనుకుంటుండగానే మా తాత మూటాముల్లె సర్దుకుంటున్నాడు.

పుస్తకం పూర్తిగా చూసి వెళ్ళమని చాలా ప్రాధేయపడ్డాను. కాని ససేమిరా ఒప్పుకోలేదు. లేడికి లేచిందే ప్రయాణం. మా తాత తంతూ అలాంటిదే! అవ్వని చూడాలని బుద్ధి పుట్టిందట ఈపుస్తకం చూసి తలనొప్పి యెత్తిందట! అక్కడ పనులన్నీ పడుకున్నాయిట! ... ఇక ఆ ప్రయాణం ఆపడం, నా తరంకాదు గదా బ్రహ్మతరం కూడా కాదనిపించింది. అక

డితో షరి. వెళ్ళినవాడు మరి తిరిగి రాలేదు. స్వగ్రామానికి వెళ్ళిన పదిరోజులలో 'హరీ' మన్నాడని వార్త — శ్రీహరీ!

ఈ గోష్ఠి తర్వాత నాకు కవిత్వం మీద కూడా విరక్తి కలిగింది. అటు పూర్వ కవితారాధకులకీ, ఇటు నవ్యకవితారాధకులికీ చెందక మధ్యేమార్గంలో అనగా త్రిశంకు స్వర్గ మధ్యంలో — ఉభయభ్రష్టత్వం ఉపరి సన్యాసం — లాగ పడడం రుచించలేదు. ఆఖరికి నాకు విస్పృహే మిగిలింది. ఎందుకంటే నా గ్రంధకర్తృత్వం, నా కవితోదంతం పత్రికల్లోకి యెక్కలేదు. బిరుదప్రధానం అంతకన్నా లేదు. దుశ్శాలువలుగాని, సశ్శాలువలుగాని, పోనీ మామూలు శాలువలుగానీ కప్పడం జరగలేదు. అధవా, నా పేర కావ్యాలేనా అచ్చువేయించి అంకితం ఇవ్వడం జరగలేదు.

కాని ఒకటి జరిగింది. నామీద కొన్ని విమర్శలు చెలరేగేయి. 'ఇలాంటి కవిశేఖరుడు మనమధ్య వుండడం మహాదృష్టకరం!' అని కొందరు మెల్లిగా అన్నారు. 'అభ్యుదయభావాలు లేని అతి ఛాందసుడు' — అని చాలామంది గట్టిగా అన్నారు. 'పాండిత్యం ఏమీలేదు' అని కొందరు బాహాటంగా అన్నారు. 'పామరుడెంత మాత్రం కాదు' అని మరికొందరు గుసగుసలు పోయేరు. మొత్తానికి ఘాటు ప్రేమలాంటి ఘాటువిమర్శలే యెక్కువగా వొచ్చేయి.

అలా రావడమే పనికొచ్చింది. లేకపోతే — కింకవీంద్ర ఘటాపంచానన చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రివర్యుల తర్వాత — కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారి తర్వాత — అంతవాడివి నువ్వే అని ఆంధ్రప్రదేశ ఆస్థానకవిగా నియమించేస్తే ఆంధ్రదేశం గతి ఏమైవుండునో అని తల్చుకుంటే ఇప్పటికీ నాకు ఒళ్ళు జలదరిస్తుంది... ఎవ్వరేమన్నా — నేను మంచిదే అన్నాను. వివాదాస్పదమైన వ్యక్తి కావడం కీర్తికి ఒకమెట్టు. దానికి దృష్టాంతాలు: శ్రీశ్రీ — చలం — నండూరి సుబ్బారావు — గురజాడ ప్రభృతులు. ఆ విమర్శలు, ఆ వివాదాలు ఉవ్వెత్తుగా ప్రజ్వరించి, పత్రికల్లో ఖండన ముండనాలు, వేదికలపై దూషణ భూషణలు జోరుగా సాగి అంటుకుంటే నేనిలా అనామధేయుడిగా వుండేవాడినిగాదు. కాని, ఆ నిప్పు అప్పుడే చల్లారిపోయి, నివురైపోయి నీళ్ళు కారిపోయింది.

దానికి నేను విచారించలేదు. నా ఉద్దేశ్యం — 'సర్వేజనాస్సుఖినోభవంతు' — అందరూ చల్లగా వుండాలి అంతేగాని అగ్గిముట్టుకొని అందరి కొంపలూ అంటుకోవాలి — అని కాదు. నా మంత్రం — 'ఓం శాంతిః శాంతిః' అంటే మనశ్శాంతి.

ధనం, పదవి, వైభవం, కీర్తి — ఇవన్నీ ఐహికాలు. ఇవి క్షణికం. ఈ ఐహిక వ్యామోహాన్ని త్యజించడం, నిష్కామ కర్మయోగం అనుష్ఠించడం — ఇవే మానవ జీవిత ధర్మసూత్రాలు — అన్న తాత్విక

# ఆంగ్జయిటీ న్యూరోసిస్

— పి. రమేష్ నారాయణ

ప్రస్తుత సమాజంలోని వ్యక్తుల్లో నేటి యువతరం, ముఖ్యంగా విద్యార్థిలోకం అమకు తెలియకనే బలపుతూండే సర్వసాధారణమయిన మానసిక వ్యాధి ఆంగ్జయిటీ న్యూరోసిస్. నిజానికీ వ్యాధికి వైద్య పరిజ్ఞానంతో సరయిన నిర్వచనమంటూ లేదు. సరిగా చెప్పాలంటే వ్యక్తులు నిష్కారణంగా తమంతట తామే అకస్మాత్తుగా గాభరాపడటము, తను మోయలేని భారమంతా తననెత్తినే పడుతున్నట్లు ఫీలవటము, పిచ్చెత్తినట్లు కావటము, ప్రతి విషయానికీ అనవసరంగా భీతి చెందటము, పిరికిగ వుండటము లాంటివి ఈ వ్యాధికి సంబంధించిన కొన్ని లక్షణాలు. ఇలాంటివి అధికం కావటం వల్ల ఈ రోగుల్లో డిజినెస్, సిక్‌నెస్ ఎక్కువగా వుంటాయి.

ఒక ప్రత్యేకమయిన, నిశ్చితమయిన కారణమంటూ లేకుండానే వ్యక్తుల్లో మానసికంగా సంభవించే అనవసరమయిన వుద్రేకము, నిరుత్సాహము లాంటి వాటితోకూడిన పరిస్థితి 'ఆంగ్జయిటీ న్యూరోసిస్' అని చాలకాలంపాటు వైద్యబృందాలు అభిప్రాయపడుతూండేవి కాని ఐదు సంవత్సరాలు క్రితం 'న్యూ ఇంగ్లండ్ జర్నల్ ఆఫ్ మెడిసిన్' అను శాస్త్రీయ పత్రికలో ఈ అంశంపై వెల్లడయిన పరిశోధనలు జీవరసాయనికంగా ఈ వ్యాధికి గల కారణాలను నిశ్చయంగా వివరించే రీతిగ తయారయ్యాయనవచ్చు.

సెయింట్ లూయిస్‌లోని వాషింగ్టన్ యూనివర్శిటీ స్కూల్ఆఫ్ మెడిసిన్ సైకియాట్రీ విభాగానికి చెందిన ఇద్దరు వైద్యశాస్త్రజ్ఞులు డాక్టర్ ఫెర్రిస్‌పిట్స్ మరియు ప్రొఫెసర్ జేమ్స్ మెక్లూర్‌లు. వీరు ఈ అంశంపై గత దశాబ్దంలో గావించిన జీవరసాయన ప్రయోగాల ఆధారంగా ఈ పేషంట్ల రక్తంలో లాక్టేట్ అన్న పదార్థం అధికంగా వుంటుందని తేలింది అంతేగాక లాక్టేట్ పదార్థాలను ఇంజెక్షన్లగ ఆరోగ్యవతలయిన వ్యక్తుల ఎక్కించటం ద్వారా వీరు ఈ వ్యాధి లక్షణాలను స్పటంగా కలిగించగలిగారు కూడా.

సాధారణంగా జీవకణాల శ్వాసక్రియ విధానంలో గ్లూకోజు ఆమ్లజనీకరణం గావించబడే జీవరసాయన చర్యల్లో మధ్యగతంగా ఈ 'లాక్టేట్' అన్న లంగారక పదార్థం ఏర్పడుతుంది ఆమ్లజని వున్న పరిస్థితుల్లో ఇతరంగా విచ్ఛిన్నమయ్యే ఈ అంశం కండరాల అలసటకు ముఖ్యకారణమనవచ్చు. పై వాషింగ్టన్ సైకాలజిస్టులు గావించిన పరిశోధనల ఆధారంగా దీనితోపాటు నాడీకణాల్లోను, కండర కణాల్లోను సంభవించే కాల్షియం అయాన్లలోపం కూడా ఆంగ్జయిటీన్యూరోసిస్ కు మరో ముఖ్యకారణమని తేలింది

పిట్స్ మరియు మెక్లూర్‌లు ఈ అంశంపై గావించిన పరిశోధనాఫలితాలింకా ఇలా వున్నాయి. నాడీకణాల్లోని కాల్షియం అయాన్ల చర్యలకు లాక్టేట్ పదార్థం అవరోధం కలిగించటం ద్వారా సంభవించే జీవరసాయన చర్యల ఫలితంగా అడ్రినలీన్ లాంటి హార్మోనుస్రావాలు అధికమవుతాయి తద్వారా రక్తంలోని లాక్టేట్ ప్రమాణము ఎక్కువ కావటము, కేంద్రనాడీమండలము కండరాల చర్యల్లో జీవరసాయనికంగా మార్పులు సంభవించటము జరుగుతాయి. వీటన్నింటి ప్రభావమే వ్యక్తుల్లో కనబడే యీ వ్యాధి.

చాలకాలంపాటు మనస్తత్వ శాస్త్రజ్ఞులకు సైకోమెడికల్ సైంటిస్టులకు ఒక కొరకరానికొయ్యగా వుంటూ వచ్చిన ఈ వ్యాధిని గూర్చి ప్రస్తుతం జీవరసాయనికంగా ఈ రంగంలో కొనసాగే ప్రయోగాలు పూర్తి సత్ఫలితాలనిచ్చే శుభదినం ఎంతో దూరం లేదంటే ఆశ్చర్యమేమీ లేదు.

# పక్షపాతం బుద్ధి పనికిరాదు



బులుసు వెంకటరమణయ్య—ధర్మపథం

బృహస్పతి దేవతలకు గురువు. ఆయనకు ఆంగీరసుడనే పేరు ఉన్నది. కారణం ఏమిటంటే—ఆయన అంగిరసుని కుమారుడు! అంగిరసుడు అన్ని విద్యల లోనూ ఆరితేరి ఉన్నవాడు. ఆయన శిష్యులుగా ఉండడానికి అందరూ ఎంతో ఆతురత పడేవారు! శుక్రుడు ఆయన శుశ్రూష చేసి, విద్యలు నేర్చుకోడానికి ఆయనను ఆశ్రయించాడు.

అంగిరసుడు తన పుత్రుడైన బృహస్పతితో పాటు శుక్రునికిన్నీ విద్యలు బోధించసాగాడు. అయినా అతనిలో పక్షపాతం అనే అవగుణం ఉండేది. తన పుత్రుడికి ఆయన బృహస్పతికి బోధించి నట్లుగా విద్యా రహస్యాలను శుక్రునికి బోధించలేదు. ఈ విషయం గ్రహించి, శుక్రుడు 'ఇక అంగిరసుణ్ణి ఆశ్రయించి వుంటే లాభం లే'దనుకుని, ఆయనను విడిచిపెట్టి గౌతముడిని ఆశ్రయించాడు.

'లోకగురుడైన శివుడు ఉండగా ఇతరులను ఆశ్రయించడం దేనికి? ఆయనకు తెలియని విద్యలు ఏవీ లేవు. ఆయనను ఆశ్రయిస్తే సమస్త విద్యారహస్యాలనూ గ్రహించవచ్చు. నీవు ఆయననే ఆశ్రయించు' అని గౌతముడు శుక్రునితో అన్నాడు.

శుక్రుడు పరమశివుణ్ణి ఆశ్రయించి, ఆయన అనుగ్రహాన్ని సంపాదించి, సమస్త విద్యారహస్యాలనూ నేర్చుకున్నాడు. మృత్యుంజయుడైన పరమశివుడు మరణించినవారిని బ్రతికించే మృతసంజీవనీ విద్యను కూడా శుక్రునికి బోధించాడు. అంగిరసుడికి ఆ విద్య తెలియదు. అందువల్ల బృహస్పతికి ఆ విద్య తెలుసుకునే అవకాశం లేకపోయింది.

బృహస్పతి దేవతలకు గురు వయ్యాడు. శుక్రుడు రాక్షసులగురు వయ్యాడు. దేవతలకూ, రాక్షసులకూ యుద్ధం జరిగేటప్పుడు యుద్ధంలో మరణించిన రాక్షసులను శుక్రుడు తన మృతసంజీవనీ విద్యాప్రభావం వల్ల బ్రతికిస్తూ వుండేవాడు. యుద్ధంలో మరణించిన దేవతలను బ్రతికించే అవకాశం బృహస్పతికి లేకపోయింది.

అంగిరసుని పక్షపాతంవల్ల దేవతలకు ఈ అనర్థం జరిగింది.

శుక్రునివల్ల ఆ విద్యను సంపాదించడానికి దేవతలు విశ్వప్రయత్నం చెయ్యవలసి వచ్చింది. ●

---

## అనామధేయుండి ...

చింతనలో పడ్డాను. 'వృద్ధనారీ పతివ్రతా' —అని, ఇప్పుడు ధర్మజిజ్ఞాస ?— అని మాత్రం నవ్వకండి.

'కామిగాక మోక్షకామిగాడు' అన్నది పౌర్వాలిక సూత్రం. 'వేమన్న' 'అరవింద యోగి' దగ్గరనుంచి 'చలం' వరకూ జరిగిందిదే. నాలో కూడా ఇదే పరివర్తన జరుగుతూంది. శేషకాలాన్ని సద్గ్రంథ పఠనంలోనూ సత్ సాంగత్యంలోనూ గడుపుదామన్న చింత బలీయంగా వుంది.

మనస్సు గుర్రం లాంటిది.—ఎంత కళ్ళెంవేసి లాగినా కంట్రోలుకాదు. అలాగ టప్పుడు—నా జీవితం వ్యర్థమైందే అన్న ఆవేదన కలుగుతూ వుంటుంది. నేను లోకానికి చిరస్మరణీయంగా ఏమి చేయగల్గాను ?

గొప్ప ఉద్యోగస్థుడినా కాలేదు. విశేషంగా ధనమూ ఆర్జించలేదు. సరిగదా—సుప్రసిద్ధ రాజకీయ నేతనైనా కాలేదు. నిరర్గళ వాగ్ధారీ పూరితుడైన వక్తనా కాలేదు. కవిసార్వభౌమ శిరోమకుట ప్రాయుడినా—అంతకన్నా కాలేదు. అసదృశ గ్రంథ సంధాన విధాన కుశలుడినీ కాలేదు. సునిశిత విమర్శకాగ్రేసర చక్రవర్తి నీ కాలేదు. నాటక కళా దురంధరుడైన నటక ఘటికుణ్ణి కాలేదు. నా జీవితం వ్యర్థమైందా అని అప్పుడప్పుడూ అనిపిస్తూంటుంది. 'జాక్ ఆఫ్ ఆల్ ట్రేడ్స్, బట్ మాస్టర్ ఆఫ్ నన్' అన్నట్లు అన్నిట్లోనూ వున్నాను, కాని దేన్లోనూ పూర్తిగాలేను.

కాని, ఒక్క విషయం సంతోషం కలిగిస్తూ వుంది. ఇది ప్రజాస్వామికయుగం. ఒకప్పుడు 'రాజ్యం వీరభోజ్యం.' ఇక ప్రజాస్వామిక యుగంలో 'రాజ్యం ప్రజా సామాన్య భోజ్యం !' ఆ ప్రజాసామాన్యంలో నేనూ ఒకణ్ణి. 'నలుగురితో నారాయణ' అని ప్రజలందరితో పాటుగా సమానంగా నడుస్తున్నవాడే ధన్యుడని చెప్పుకోవాలి. ప్రపంచంలో సామాన్యప్రజలిదే మెజారిటీ! లబ్ధప్రతిష్ఠులు మైనారిటీ వర్గంలో వున్నారు. అందుచేత మెజారిటీ పార్టీలో ఉండడం నాకు సంతోషకారణం.

అదీగాక—

'పదుగురాడు మాట పాటియై ధర జెల్లు...'

ఆ పదుగుర్లోనూ నేనూ వున్నానని సగర్వంగా చెప్పుకోగలగడం గర్వకారణం కాదా ?

ఇంకో సంగతి.

'అపయశోభాజనుండయి ఉడదు కన్న మహి ననామధేయుండయి మనుటమేలు!'

ఏమంటారు ?

(అయిపోయింది) ●

# వారఫలం

**1-12-1972 శుక్రవారం మొదలు**

**7-12-1972 గురువారం వరకు**

**మేషం :** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. వారంమధ్యలో చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**వృషభం :** కొన్ని వ్యవహారాల్లో అనవసరమైన సందేహాలు కలుగుతాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వారంమధ్యలో మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**మిథునం :** వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారంమధ్యలో మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. పోటీవారితో వాదప్రతివాదాలు తగవు. ప్రయాణాలు వాయిదా పడతాయి.

స్త్రీలకు— సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**కర్కాటకం :** అన్నివ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. వారం మధ్యలో వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు— పోటీవారిలో గౌరవం లభిస్తుంది. విలాస వస్తువులు కొంటారు.

**సింహం :** మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. వారంమధ్యలో సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

**కన్య :** రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— నూతన విషయాలను తెల్సుకొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల :** వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీకృషి రాణిస్తుంది. మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అలంకార వస్తువులు కొంటారు.

**వృశ్చికం :** కొన్ని వ్యవహారాల్లో ప్రయోజనం లేని శ్రమ కలుగుతుంది. వ్యాపారంలో చికాకులు యేర్పడతాయి. వారంమధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగుంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**ధనుస్సు :** మీ ప్రయత్నాలు నిరాటంకంగా నెరవేరతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారంమధ్యలో మీ విలువైన వస్తువులు పోవచ్చును. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మకరం :** అన్ని వ్యవహారాల్లోను సౌలభ్యం లభిస్తుంది. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**కుంభం :** వృత్తిలో అనుకూల వార్తలను వింటారు. నూతన విషయాలను తెల్సుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగుంటాయి. ప్రయాణాలు వాయిదా పడతాయి.

స్త్రీలకు— విలాస వస్తువులు కొంటారు. దైవకార్యాలు నెరవేరతాయి.

**మీనం :** కొన్ని వ్యవహారాల్లో ఆందోళన కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యతిరేకమైన వార్తలను వింటారు. వారంమధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్









జ రి గి న క థ

తల్లికి ఇష్టంలేకపోయినా ఎం. ఎ. లో చేరాడు విద్యార్థి. తన అన్నకూతురు లక్ష్మిని విద్యార్థి వివాహం చేసుకుని జీవితంలో స్థిరపడాలని ఆమె ఉద్దేశ్యం. కాని, లక్ష్మి ఎవరినో ప్రేమిస్తున్నట్లు తెలుసుకున్న విద్యార్థి, మేనమామతో వాదం పెంచుకుని తిరిగి వచ్చేస్తాడు, జ్ఞానాంబ విద్యార్థిని బాగా ఆకర్షించింది. ఇద్దరూ బాగా చనువుగా వుంటున్నారు. లక్ష్మిని ప్రేమించిన మధుని వెతికి పట్టుకున్నాడు విద్యార్థి. కాని, అలాంటి మోసగాడ్ని పెళ్ళిచేసుకోనంది లక్ష్మి. మధూకి బుద్ధి చెప్పి పంపించాడు విద్యార్థి. టెర్మినల్ పరీక్షలు అయిపోయాక ఇంటికి వెళ్ళాడు విద్యార్థి. తల్లి తెచ్చిన సంబంధానికి అతను ఇష్టపడలేదు. పెళ్ళి అన్నప్పుడల్లా అతని మనసులో జ్ఞానాంబ మెదులుతూ వుంది. జ్ఞానాంబకు జబ్బుచేసి చనిపోతోంది. ఆమె మరణం విద్యార్థిని బాగా కలవరపరచింది.

## 21

మర్నాడు సత్యం వచ్చినట్లు తెలిసింది ... ఆరోజు ఆదివారం...కాలేజి కూడా వుండదు కనుక ప్రొద్దున్నే కాఫీ కాంగానే అన్నం వండేసి, సత్యంగదికి వెళ్ళాడు...

అతడు వెళ్ళేసరికి లోకన్‌బాబు స్టౌ దగ్గర కూర్చుని అన్నం కలియబెడుతున్నాడు...సత్యం తూర్పుకు తిరిగి, బాసిన పట్టు వేసుకుని శ్లోకం చదువుతున్నాడు ...

'యస్సర్వత్రా నభిస్నేహస్తత్తత్ప్రాప్య
శుభాశుభమ్,
నాభినందతి నద్వేష్టి తస్య ప్రజ్ఞా
ప్రతిష్ఠితా
యదా సంహరతే చాయం కూర్మోంగానీవ
సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా
ప్రతిష్ఠితా.'

విద్యార్థి లోపల కడుగు పెడుతూనే విస్మయంతో 'ఇదేమిటి యీపూజ లెప్పటి నుండి?' అన్నాడు.

'మరే చూడండి గురుగారూ...నన్నేమో కత్తిపీట దగ్గరనుండీ స్టౌ దగ్గరకు ట్రాన్స్‌ఫర్‌చేసి, తనక్కడకు మారిపొయ్యాడు చూడండి.' అన్నాడు లోకన్‌బాబు ఫిర్యాదుగా ...

'రారా విద్యార్థీ...కూర్చో...' అంటూ అతడ్ని నవ్వుతూ ఆహ్వానించి, తన పక్కన చాపమీద కూర్చోమని చూపించి, 'అది కాదోయ్ లోకన్...పోనీ నువ్వే యిక్కడ కూర్చుని యిది విన్పించమంటే కాదంటివిగా?' అన్నాడు. యింకా నవ్వుతూనే ...

'మరే...అదేమో నోరు తిరగదు...ఇదేమో చెయ్యి తిరగదు...ఎందుకైనా మంచిది కదా అని చెయ్యి తిప్పడమే ప్రాక్టీసు చేస్తున్నాను...' అన్నాడు లోకన్‌బాబు...

విద్యార్థి సత్యాన్ని విస్తుపోయి చూస్తున్నాడు...తండ్రి పోయి పుట్టెడు దుఃఖంలో వుండి తను పలకరిస్తేనే కంట తడిపెడ్తాడేమో ననుకుంటే యితడు ఏమీ జరగనట్లే మాట్లాడుతున్నాడు! ...

'ఇదేమిటి యిలా చిక్కిపొయ్యావ్?' సత్యం అడిగాడు విద్యార్థిని.

'ఏం లేదులే...ఈమధ్య నాల్గురోజులు జ్వరం కాసింది...అది సరే ఏమిటి యింకా పూజలు చేస్తున్నావ్?...దేముడు నీకు ఏం సాయం చేశాడని?'

'దేముడేం సాయం చెయ్యాలిరా నాకు?... అసలు ఎప్పుడూ దేముడు సాయం చెయ్యడం నేను ఆ సాయం అందుకోడం అయితే నాకు నేను సాయం చేసుకునే దెప్పుడురా? ... దేముడు నాకు చెయ్యాల్సిన సాయమల్లా ఒక్కటేరా ... అదే ... ఎన్ని అవాంతరాలు వచ్చినా ... చెక్కుచెదరని ఆత్మస్థైర్యం, మనోబలం యివ్వడమే...' అలా అంటూన్నప్పుడు అతడి కంఠం గద్గదమైంది ...

'అయితే ఆ ఆత్మస్థైర్యం మంత్రాలు చదువుతే వస్తుందా? ...' వ్యంగ్యంగా అన్నాడు విద్యార్థి...

'నేను చదువుతున్నది మంత్రాలు కాదురా...గీత...భగవద్గీత... అర్జునునికి ... స్థితప్రజ్ఞుడి లక్షణాలు వివరిస్తూ ... ఎవడైతే శుభాశుభాలను, సుఖదుఃఖాలను సమంగా స్వీకరిస్తాడో, ఏ విధంగా తాబేలు తన సర్వావయవాలను ముడుచుకుంటుందో అదేవిధంగా ఎవడు యింద్రియ లోలుపత నుండీ తన మనసును మళ్లించుకుంటాడో అతడే స్థితప్రజ్ఞుడని శ్రీకృష్ణుడు చెబుతున్నాడు' అన్నాడు సత్యం...

'ఇంద్రియాలమీద ఆసక్తి లేకపోతే దేన్నయినా నువ్వు తీవ్రంగా వాంఛించకపోతే నీకో లక్ష్యమంటూనే లేకపోతే యిక లక్ష్యసిద్ధి ఎలా సాధ్యమవుతుంది సత్యం...లేకపోతే యిక ముక్కుమూసుకుని జపం చేసుకుంటూ, రాలిన పండ్లు ఫలాలు తిని కూచోమనా మీ 'గీత' చెబుతోంది?' వెటకారంగా అన్నాడు...

'ఎప్పటికీ కాదు...ప్రతివాడికీ ఒక లక్ష్యముండాల్సిందే...ఆలక్ష్యసిద్ధికి నువ్వు తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ తీసుకోవలసిందే ... తప్పదు...కానీ ఫలితాన్ని గురించి మాత్రమే ఆత్రుత పడవద్దు...ఫలితం నీ దీక్ష, నీ ఏకాగ్రత, నీ సంకల్పబలం, నీ కృషి.. వీటిమీద ఆధారపడి వుంటుంది ... ఉదాహరణకు ఒక డాక్టరున్నాడనుకో ... అతడు రోగులకు చాలా జాగ్రత్తగా, కంగారుపడకుండా ఆలోచించి వైద్యం చెయ్యగలుగుతాడు ... అదే తన ఆత్మీయులైతే?... ఇంజక్షన్ బాటిల్ ఓపెన్ చెయ్యబోయి వేలు కోసుకుంటాడు... అతడి బుర్ర పనిచెయ్యడం మానేస్తుంది... తను ఒక డాక్టరునన్న విషయమే మర్చిపోతాడు...ఎందువల్ల యీ తేడా?...రోగులు యితరులైనప్పుడు అతడి నిర్మమత్వం అతడికా విశ్చలతను యిస్తుంది...ఈ నిశ్చలత

ఏకాగ్రతకు వుపయోగ పడుతుంది.' అని వివరించాడు సత్యం ...

'ఇంతకూ దేముడనే వాడు వున్నాడంటావా? ... అది కేవలం ఒక భ్రమ కాదూ?'

సత్యం కాసేపు మాట్లాడలేదు ... ఆ తర్వాత...

'విద్యార్థీ!...దేముణ్ణి ఎవ్వరూ చూడలేదు ... అది నిజమూ కావచ్చు ... భ్రమా కావచ్చు...అదే భ్రమే అనుకున్నా అందమైన భ్రమ ... ఆత్మవిశ్వాసాన్ని యిచ్చే భ్రమ అంటాను నేను ... ఏందుకంటావా?... ఎడారిలో ప్రయాణం చేసే మనిషికి, దగ్గర్లో ఒక ఒయాసిస్సు వుందన్న వూహా కొంత బలాన్ని యిస్తుంది...మానవుడికీ అంతే...కష్టాల్లో వున్నప్పుడు అంత అదృశ్య అభయ హస్తం అండ వుందన్న వూహా కొంత మానసిక బలాన్ని యిస్తుంది ...ఎడారిలో ప్రయాణం చేసేవాడికి నిజంగా ఒయాసిస్సే కన్పిస్తే కొంత సేద తీరుతాడు...లేక అది ఎండమావే అయితే... ఒయాసిస్సు వుందన్న ఆశతోనన్నా, దాన్ని చేరుకోవాలన్న ఆరాటంతోనైనా మరి కొంతదూరం ప్రయాణం చేస్తాడు...ఈ లోపల అతడు తన లక్ష్యాన్నే చేరుకుంటాడేమో ఎవరు చెప్పగలరు?'

'సత్యం...ఒకవేళ దేముడనే వాడున్నా అతడు మనకు సాయం చేస్తాడన్నది కల్ల. అడుగడుగునా మనల్ని యిక్కట్లపాలు చేస్తూ, మన లక్ష్యంవైపు సాగనివ్వకుండా చెయ్యడమే లక్ష్యంగా పెట్టుకున్న దేముడూ ఒక దేముడా?...'వాట్ ఫ్లైస్ ఆర్ టు వాంటన్ బాయిస్ ఆర్ వుయ్ టు ది



# విద్యార్థి

గాడ్స్' అని 'కింగ్ లియరు'లో షేక్స్పియరు అన్నట్లు, ఆకతాయిపిల్లలు తూనీగలతో ఆడుకొన్నట్లు, మన జీవితాలతో ఆడుకునే దేముడూ ఒక దేముడేనా?...'

'పొరపాటు పడుతున్నావ్ విద్యార్థీ... 'రన్నింగ్ రేస్'లో పాల్గొనేవాళ్ళకు పిక్కబలం రావడంకోసం రకరకాల ఎక్సరసయిజెస్ చేయిస్తారు డ్రిల్లుమాస్టర్లు...పబ్లిక్ పరీక్షకు వెళ్ళే విద్యార్థులకు కఠినమైన ప్రశ్నలిచ్చి, 'హవుస్ ఎగ్జామ్స్' రాయిస్తారు టీచర్లు...వీళ్ళందరూ కచ్చకొద్దీనే అలా చేస్తున్నారా?...ఇదీ అంతే...మనలో అంతర్నిహితమై వున్న శక్తులకు వుద్దీపన కలుగుతే తప్ప మన సంకల్పసిద్ధి పొందలేము...సావిత్రీ సత్యవంతుల కథ తీసుకో... సావిత్రి, సత్యవంతుడు ఏడాదిలో చనిపోతాడని తెలిసికూడా వివాహమాడి, అతడిని మృత్యువునుండి రక్షించి, బలమైన విధి కంటే బలవత్తరమైనది సంకల్పబలం అని నిరూపిస్తే దేముడు ఆగ్రహించలేదే? ...పైపెచ్చు ఆవిడకు కావల్సిన శక్తిని ఇచ్చాడే?...ఆమెను మనమంతా దేవతలా పూజిస్తున్నామంటే ఏమిటి అర్థం?... కొంచెం ఆలోచించు...'

విద్యార్థి ఆలోచనలో పడిపోయ్యాడు. ...ఆ తర్వాత కాసేపు అవీ యివీ మాట్లాడి తన గదికి వచ్చేశాడు...తలుపు తియ్యగానే ఎదురుగా వేంకటేశ్వరుని పటం...చేతిలోకి తీసుకున్నాడు...ఇన్నాళ్ళూ ఈయన్ని తన శత్రువుగా వూహించుకున్నాడా?...

పటంలోకి చూశాడు...నిజంగా నామీద నీకు కోపం లేదా?...నువ్వు నాకు శత్రువు కాదా?...అంతర్గతంగా ప్రశ్నించుకున్నాడు...పటం ప్రశాంతంగా నవ్వినట్లయింది...

మళ్ళీ యథాస్థానంలో పెట్టేశాడు... తనకెవ్వరూ శత్రువులు లేరన్న భావన అతడికెంతో హాయినిచ్చింది...తేలిగ్గా వూపిరి పీల్చుకున్నాడు...

'ఇండో — ఆంగ్లియన్ లిటరేచరు'లో అతడికి అరవిందయోగి 'సావిత్రి' వుంది. దాన్ని అతడు ఆప్షనల్ వెయ్యదల్చుకోలేదు... అందుకే ఆ క్లాసులకు వెళ్ళేవాడు కాదు... ఇవ్వాళ సత్యం సావిత్రి పేరెత్తాక అతడికి వుత్సుకత కలిగింది... వెంటనే 'రీజినల్ లైబ్రరీ'కి వెళ్ళి అరవిందయోగి 'సావిత్రి' తెచ్చుకున్నాడు. కొన్ని కొన్నిచోట్ల అతడికి అర్థం కాకపోయినా, ఆ పుస్తకం అతడికి చాలా బాగా నచ్చింది. ముఖ్యంగా అశ్వపతి యిల్లాలు నారదుని వేసిన ప్రశ్నదాని కాయన యిచ్చిన జవాబు...

'పెయిన్ యీజ్ ది హేమర్ ఆఫ్ ది
గాడ్స్, టు బ్రేక్
ఎ డెడ్ రెసిస్టెన్స్ ఇన్ ది మార్టల్స్ హార్ట్,
పెయిన్ యీజ్ ఎ హేండ్ ఆఫ్ నేచర్
స్కల్ప్చరింగ్ మెన్
టు గ్రేట్‌నెస్!...'

కష్టాలు మానవునిలో నిద్రాణమైన శక్తిని మేల్కొల్పడానికి భగవంతుడుపయోగించే ఆయుధాలు ... మానవుని మహోన్నతునిగా మలచడానికి ప్రకృతికి పనికివచ్చే వుపకారణాలే ఈ కష్టాలన్న ఆ భావం అతడికి ఎంతో నచ్చింది.

అతడిన్నాళ్ళూ సావిత్రిని పుక్కిటి పురాణాల్లోని పాత్రగా మాత్రమే భావించాడు. కాని యిప్పుడతనికి సావిత్రి, బలీయమైన విధినే ఓడించి అజేయమైన మానవ శక్తికి ప్రతీకగా అనిపిస్తోంది. శక్తిస్వరూపిణి అయిన సావిత్రి, చీకటిలాంటి, అజ్ఞానంలాంటి, వినాశనహేతువైన యముడిలాంటి 'విధి'ని వదలక వైతరణివరకూ వెంటపడి సత్యస్వరూపుడైన సత్యవంతునికి పునర్జన్మనిచ్చి, బలీయమైన 'విధి'కంటె బలవత్తరమైనది సంకల్పబలం అని చాటి చెప్పిన ఆ మహోన్నతమూర్తి 'సావిత్రి' అతడి ఆరాధ్యదేవతే అయింది...

రోజులు గడుస్తున్నాయి ... అతడు మామూలుగా క్లాసులకు వెళ్తున్నాడుగాని మామూలు మనిషి కాలేకపొయ్యాడు. ఏదో ఒక నిర్లిప్తత...

ఆరోజు ఆదివారం... ఇంగ్లీషు డిపార్టుమెంటువాళ్ళంతా అమరావతి పిక్‌నిక్ వెళ్ళారు. విద్యార్థి రానన్నాడు. కానీ మిగతా వాళ్ళంతా బలవంతంచేసి లాక్కెళ్ళారు. ఉదయం అక్కడికి వెళ్ళగానే ముందు అమరలింగేశ్వరుని చూచి వచ్చారు. ఆలయం ప్రక్కనే పారుతోంది కృష్ణ... గుడిమెట్లమీద కూర్చుని అలా ఆ కృష్ణానదిని చూస్తుండగా క్లాస్‌మెట్ సజ్జన్‌బాబువచ్చి, 'ఇక్కడ కూర్చున్నారేం మీరు?... రండి... అక్కడ అందరూ బోట్ షికార్‌కు వెళ్తున్నారు.' అని పిలిచాడు.

'ఏం లేదు ... ఈ కృష్ణను చూస్తున్నాను సజ్జన్‌బాబు ... అటు చూడండి... సాగరోన్ముఖంగా సాగిపొయ్యే ఈ కృష్ణవేణమ్మ ఎన్నికొండలు దాటుకుంటూ

హరిరామ్









# న్యూట్రిన్ రంగుల పోటీ ఎంతో ఉత్సాహపూరితమైనది!

**444 బహుమతులు గెలువవచ్చు!**

పోటీ ముగింపుతేదీ
డిసెంబరు 31, 1972



త్వరపడండి! మీ డీలరువద్దనుండి మీ ఎంట్రీ ఫారాన్ని నేడే తీసుకోండి!

**వయస్సు 3 గ్రూపులలో**

'ఏ' - 8 సంవత్సరాలలోపు
'బి' - 8-10 సంవత్సరాలమధ్య
'సి' - 11-14 సంవత్సరాలమధ్య

3 ప్రథమ బహుమతులు
ఒక్కొక్కటి రు. 501 + రిస్టువాచి
+ ప్యాకెట్ ట్రాన్సిస్టర్లు
9 ద్వితీయ బహుమతులు
రిస్టువాచీలు
99 తృతీయ బహుమతులు
ప్యాకెట్ ట్రాన్సిస్టర్లు
333 సముచిత బహుమతులు!

**చాలా తేలిక!**

పోటీలో పాల్గొనటం ఎలా: మీ డీలరువద్దనుండి ఒక ఎంట్రీఫారాన్ని తెచ్చుకోండి. చిత్రానికి రంగులు వేయండి. చిత్రానికి రంగులు వేయటం అహా! ఎంత ఆహ్లాదకరమో! న్యూట్రిన్ మిఠాయిల రు. 1/- ప్యాకెట్టులో న్యూట్రిన్ చెవలాయ్ స్టాంపు వుంది. చిత్రానికి రంగులు వేయటం పూర్తి అయ్యాక చెవలాయ్ స్టాంపును ఆ ఎంట్రీఫారములో దానికిగాను నిర్ణయించబడినచోట అంటించి యీ క్రింది చిరునామాకు పంపండి.

న్యూట్రిన్ రంగుల పోటీ, c/o న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, కంఘనేరు రోడ్, చిత్తూరు (ఆం. ప్ర.)

అర్హులైన బృందం న్యాయనిర్ణేతలుగా నియమించబడి ఎంట్రీలను పరిశీలిస్తారు.

**రంగులు వేయటం ఆరంభించండి - మీరే గెలుపొందవచ్చు!**

ఆరోజు మే పదహారు ... బంగాళాఖాతంలో బయలుదేరిన వాయుగుండం తుఫానుగా మారింది ... ఆ తుఫాను తూర్పు తీరం వెంబడి పయనించి గంటకు నూటయాభై మైళ్ళ వేగంతో వస్తూ, చీరాల — వుప్పుగొండూరు స్టేషన్ల మధ్య ప్రళయ ఝంఝామారుతంలా వీచింది ... సుమారు ముప్ఫై గంటలకాలం తుఫాను కరాళనృత్యం సల్పింది...దీనికితోడు కుండపోతగా వర్షం... ఎక్కడి రైలు బళ్ళు అక్కడే ఆగిపోయ్యాయి ... గుంటూరుజిల్లాలోని కొన్ని గ్రామాలకు యితర ప్రపంచంతో సంబంధాలే తెగిపోయినయి. పదిహేడవ తారీఖున విజయవాడ చీరాల రైలుస్టేషన్ల మధ్య రైలుమార్గానికి ఎన్నో గండ్లు పడ్డయి... చిన్నగంజాం వుప్పుగొండూరులమధ్య రెండు వంతెనలు ధ్వంసమైనయి... ఒకటి ప్రవాహ వేగానికి వంగి వుయ్యాలలా తయారయితే, మరో వంతెన పూర్తిగా నీళ్ళల్లో కొట్టుకుపోయింది ... బ్రిడ్జి నెంబరు ఆరువందల ఆరు, ఆరువందల ఎనిమిది యీ విధంగా ధ్వంసమైనాయి. ఉప్పుగొండూరు స్టేషనులో సర్కార్ ఎక్స్‌ప్రెస్‌ను నిలిపి వెయ్యాల్సి వచ్చింది .. ప్రయాణీకులకు రైల్వే ప్లాట్‌ఫారంమీద అన్నపానాదులు సరఫరా చెయ్యాల్సి వచ్చింది...అసంఖ్యాకంగా ప్రాణ నష్టం...అపారమైన ఆస్తి, పంటలూ పశువులు నష్టం ... కొన్నివేల ఎకరాలు జలమయం అయినయి ... కొన్నివేల మంది నిరాశ్రితులై నిలబడ్డారు ... ఈ తుఫాను విలయతాండవం, ఈ ప్రకృతి వికృత నికటాట్టహాసం కొన్ని వందల ప్రాణాలను ఆహుతి తీసుకుంది...ఉప్పుగొండూరు దగ్గరలో వున్న నీలాయపాలెం యానాదికాలనీ నామరూపాలు లేకుండా తుడిచిపెట్టుకుపోయింది. చుట్టుపక్కల చాలా వూళ్ళలో డాబాయిళ్ళు సైతం పడిపోయిన వుదంతాలు, రైలుపట్టాలు కిరుపైపులా గుట్టలుగా పడివున్న మానవ, జంతు కళేబరాలు, హృదయాల్ని కదిలించి వేస్తున్నాయి ... టెలిఫోన్, టెలిగ్రాఫ్ సంబంధాలు పూర్తిగా తెగిపోయినయి ... ఐ. ఏ. ఎఫ్ విమానాలు ఆహార పదార్థాలను విసిరివేస్తున్నాయి ... జమ్ములపాలెం మొదలగు కొన్ని గ్రామాలో మిలిటరీ వచ్చి సహాయ కార్యక్రమాలలో పాల్గొంటున్నది...

ఈ హృదయ విదారకమైన వార్తలను రేడియో అదేపనిగా విన్పిస్తోంది...పత్రికలు ఫోటోలతోసహా ప్రచురిస్తున్నాయి. ఇది విన్న ఏ తెలుగువాడు కంట తడిపెట్టడు?...

విద్యార్థికి ఏం చెయ్యాలో తోచలేదు... ఉప్పుగొండూరుకు దగ్గర్లోనేవున్న అక్కా వాళ్ళూ ఏమయ్యారో తెలియదు ... పద్దెనిమిదవ తారీఖుకు యీ తుఫాను రక్కసి ఆకలి తీరనట్టు, విజయవాడ గుంటూరు పట్టణాలను తాకింది...ఉధృతమైన గాలి... ఆకాశానికి చిల్లులు పడ్డట్టు వర్షం... ఎవ్వరూ కదలడానికి వీల్లేని పరిస్థితి... ఒకవైపు పరీక్షలు...ఈ వ్రస కాలన్నీ ఒక్కసారి అయినా చదవలేక పోతినే అన్నదిగులు... వీటికితోడు అక్కావాళ్ళను గురించిన ఆందోళన ...

టెలిగ్రాము యివ్వడానికి ఆ సంబంధాలు ఎప్పుడో తెగిపొయ్యాయి. ఇక ఏంచెయ్యాలి? ఈ లోపల మే ఆఖరి వారంలో జరుగబొయ్యే పరీక్షలు పోస్టుపోన్ చేసినట్లు రేడియోలో ప్రకటన విన్న విద్యార్థి యిక ఆలస్యం చెయ్యలేదు ... డబ్బును గురించి కూడా ఆలోచించలేదు ... బాంకిలో మిగిలి వున్నది కాస్త తీసుకుని, ఒక టాక్సీమీద అక్కా వాళ్ళవూరు బయలుదేరాడు...

(ఇంకా ఉంది)


చర్మ వ్యాధులకు డాక్టర్లచే సిఫారసు చేయబడినది
చుండ్రు
నల్లమచ్చలు
గోబి
మొటిమలు
చాకలి గజ్జి
గజ్జి
తామర
అన్ని మందుల షాపులలోను దొరుకును
MEDIMIX
మెడిమిక్స్
ఔషధ సబ్బు
CHOLAYIL PHARMACEUTICALS • 14, A. P. ROAD, MADRAS-7

REGD

వాడండి ముఖ్యంగా అలస్యమైన, క్రమముగాకాక పోయిన, బాధతోకూడిన, లేక ఆగిపోయినబహిష్టకు

ప్రసిద్ధిచెందిన ఔషధము

SEALED PACKING 28 & 14 TABLETS
AVAILABLE AT ALL CHEMISTS

MFRS. SEENU & CO., MADRAS-81



## తెలుగు ఆంగ్ల భాషా బోధిని




తెలుగు తెలిసినవారు ఇతరుల సహాయం లేకనే 3 మాసము లలో ఇంగ్లీషు చదువనూ, వ్రాయనూ, మాట్లాడనూ అతిసులభంగా నేర్చుకొన వచ్చును. వెల, పోస్టు ఖర్చులో సహా, 6—50

కంటువని స్వబోధిని రు. 5—00

KASTHURI AGENCY, (P)
No 34, P K G. Street, 1st Lane, Madras-1



## స్త్రీ సౌందర్యమునకు

అధిక [illegible] అంగము, [illegible] బలహీనత [illegible] అనేక [illegible] ఫలితంగా [illegible] శాస్త్రీయంగా, చికిత్స చేయబడును. పూర్తి వివరములు తెలుపుచూ, రూ. 1/—స్టాంపులు గాని రొఖంగాని పంపండి. ఉత్తర ప్రత్యుత్తరములు రహస్యముగా ఉంచబడును. 1 నెలకు రు. 31—50 అడ్వాన్సు రూ.20— పంపవలెను.

గుణములేదని నిరూపించిన డబ్బు వాపసు చేయబడును.

ఇది మా గ్యారంటీ.

Dr K. V. Naidu,
Beauty Creators (Regd)
290, Adhyakshamvari st.,
Nellore-1, (A P.)


# విద్యార్థి

లనుకుంటున్నట్లున్నారు...మా క్లాసువాళ్ళు అప్పుడే తిరుగుముఖం పడుతున్నారు...అందు కని మీకు కావల్సిన వివరాలన్నీ తర్వాత వ్రాస్తానులెండి...ఆ తర్వాత మీయిష్టం... 'రవి గాననిచో గవిగాంచు నెయ్యోడన్' అన్నారు' అని చెప్పి సెలవు తీసుకున్నాడు సజ్జన్‌బాబు ... విద్యార్థికూడా ఆయనకు చెప్పాడు వచ్చేటప్పుడు...

ఆర్తికి అంతా తిరిగి వచ్చేశారు...

ఇప్పుడు విద్యార్థికి జ్ఞానాంబ జ్ఞాపకాలనుండి పారిపోడానికి చదువొక్కటే మార్గం ... తను కృతార్థుడు అవనీ అవకపోనీ ... కానీ యిది పూర్తిచెయ్యాలి ... అప్పుడే జ్ఞానాంబ ఆత్మకు శాంతి ... జ్ఞానాంబ స్నేహానికి సాఫల్యం ... లక్ష్మి తరచూ వచ్చి చూసిపోతుంటుంది ... వచ్చినప్పుడల్లా వద్దన్నా వినకుండా వంటచేసి పెట్టి పోతుంది... స్కూలుకు వెళ్ళేప్పుడు కూడా విద్యార్థిని పలుకరించకుండా వెళ్ళదు లక్ష్మి...అంత అన్నే ఒక్కతే భరించలేక వెనుకటియిల్లు ఖాళీచేసి, విద్యార్థి గదికి దగ్గరలో వేరొక చిన్నగది తీసుకుంది...

'లక్ష్మీ! ... మనిద్దరి జీవితాలు ఎందుకిలా అయ్యాయి? .. నువ్వయినా పెళ్ళి చేసుకో లక్ష్మి ... కనీసం నువ్వు సుఖపడుతుంటే నన్నా చూసి ఆనందిస్తాను' అన్నాడు...

'నేను వద్దన్నానా? ... తీసుకురా బావా పెళ్ళికొడుకును ... నువ్వే అన్నావుగా తెలిసి తెలిసి నన్ను చేసుకునేవాడెవడూ వుండడని' లక్ష్మి నవ్వుతూ అంది

'ఆరోజు అన్నావుకదూ...నేను జ్ఞానాంబకు తగనని, తను అదృష్టవంతురాలు కాబట్టే నాలాంటి బలహీనుడికి భార్య కాకుండా తప్పించుకుందనీను...'

'క్షమించు బావా ... అలా కావాలనే అన్నాను ... నువ్వు చదువు మానుతానంటే నాకు చాలా కష్టం వేసింది... అందుకని అట్లా అన్నాను...ఏమీ అనుకోకు బావా...'

'లేదు లక్ష్మి ... నువ్వన్నది నిజం ... జ్ఞానాంబ ఆరాధనీయ...అందని చందమామతో పొత్తుపెట్టుకోవాలను కున్నాను... అందుకే తప్పించుకుపోయింది' అన్నాడు డగ్గుత్తికతో.

'ఊరుకో బావా...అట్లా నిన్ను నీవు కించపర్చుకోకు...'

'అయినా పెళ్ళికాని పిల్లవు...ఇలా మాటిమాటికీ యిక్కడకు రాకు లక్ష్మి... లోకం నిన్ను నానా మాటలూ అంటుంది. అయినా రావద్దంటే వస్తావేం?'

'బావా...నేను ఒకరు పిలిస్తే రాను ... ఒకరు వద్దంటే వెళ్ళిపోను... నా యిష్టమొచ్చినచోటికి యిష్టమొచ్చినప్పుడు వెళతాను...' అన్నది నవ్వుతూ లక్ష్మి...

'అయినా యిది మాత్రం ఎన్నాళ్ళులే ... నీకు పెళ్ళయి మీ శ్రీమతి వచ్చేదాకానే ... ఆ తర్వాత లోపల కదుగుపెడితే ఆవిడ తన్ని తగలెయ్యదూ?...'

'నాకుమాత్రం పెళ్ళెలా అవుతుందనుకున్నావ్ లక్ష్మి ... నా సంగతి తెలిసినవాడెవ్వడూ పిల్లనివ్వడులే దిగులుపడకు.'

'నీకేం బావా ... మగ మహారాజువి ... నిన్నెవ్వరూ వేలెత్తి చూపించరు ... కళ్ళు కద్దుకుని పిల్లనిచ్చి కాళ్ళు కదుగుతారు నువ్వు ఊ అనగానే...'

'ఒకవేళ పిల్ల కన్నెచెర వదిలించాలని ఏ తండ్రి అయినా సాహసిస్తాడేమోగాని, ఏ పిల్లామాత్రం క్షమించలేదు...'

'ఏం లేదు...ఆడవాళ్ళది మీలాంటి రాతి గుండె కాదు ... సాధించినా ఆడదే సాధించిపొయ్యగలదు.. క్షమించినా ఆడదే క్షమించగలదు తెలుసా?'

విద్యార్థి గుండెల్లో ఆ మాటలు బాగా నాటుకున్నాయి ... అతడిలో ఆలోచనలు రేపాయి ... ఈ విషయంలో పురుషుడు సంకుచితహృదయుడా?...' ఆలోచిస్తున్నాడు విద్యార్థి...

రెండునెలలు గడిచాయి...పరీక్షలు దగ్గర కొస్తున్నాయి ... మేనెల ఎండలు... చండ ప్రచండభానుడు 'నా ప్రతాపానికి తిరుగే లే'దన్నట్లు మింట మిడిసి పడుతున్నాడు ...

ఇన్నాళ్ళూ పూర్తిగా అలక్ష్యం చేసినందువల్ల విద్యార్థికి చదవాల్సింది చాలా వుండిపోయింది... రోజులు గడిచేకొద్దీ విద్యార్థికి కనీసం సెకండ్‌క్లాస్ రావడంకూడా కష్టమేమో ననిపిస్తోంది ... అయినా అతడు ప్రయత్నం మానలేదు ... అహోరాత్రులు చదువుతూనే వున్నాడు...

పరీక్షలు కొద్దిరోజుల్లో కొచ్చాయి ...

# "టెక్నో-సైంటిఫిక్ తెలుగూ"
# లేక తెలుగుభాషా పెంతక్యూతింది

అలమూరులో నో యిద్దరు వ్యక్తులు విరోధులయినా, పెద్ద చదువులకు వారే అమెరికాపోవెళ్ళి, అనుకోకుండా అక్కడ ఒకచోట కలిసి వెంటనే స్నేహితులైపోతారు. ఆనక ప్రాణస్నేహితులవుతారు. దీనిక్కారణం ఏమిటి!

ఒకటి దేశాభిమానం, రెండోది భాషాభిమానం.

ఈ రెండూ ప్రతిమనిషిలో కొద్దో, గొప్పో తప్పక వుంటూనే వుంటాయి.

తెలుగుభాష అంత గొప్పదయితే శాస్త్ర విజ్ఞాన శాస్త్రాలన్నీ ఆ భాషలోనే ఎందుకుండరాదు అని వో చిన్న ప్రశ్న బయల్దేరిందీనాడు. ఏభాష వారికి ఆ భాషలో చెప్తే బోధపడినంత హాయిగా మరే యితర భాషల్లోనూ సర్వసాధారణంగా బోధపడదు. మనం మన మాతృభాషను నిత్యమూ వాడడానికి ప్రయత్నించి, ఇతర భాషల్లో మనం నేర్చుకున్న విజ్ఞానాన్ని మన భాషలోకి తర్జుమా చేసుకోగలిగిన స్థోమత సంపాదించుకోడం కాస్త కష్టమైనపనే అయినా అసాధ్యం మాత్రం కానే కాదు. తెలుగు ఆధునిక భాషగా జీవించాలంటే కృషి అవసరం. కృషితో నాస్తి దుర్భిక్షమ్ అన్నారందుకే. ఏ భాషయినా ఆధునిక భాషగా జీవించాలంటే స్వతహాగా ఆ భాషకు కొన్ని వసతులుండాలని కొందరు గొంతుచించుకుని అరుస్తున్నా, భాషా శాస్త్రవేత్తలు మాత్రం అలాటి దేమీలేదని, ఏ భాషా నిర్మాణమయినా ఆధునీకరణకు అడ్డు వచ్చేది కాదనీ తేల్చి చెప్పారు.

అవసరం మనలు పరిశోధనకు తల్లిలాటిది. అవసరానికి కొత్త మాటలు పుట్టి, వాడుకనిబట్టి అవి ఆ భాషకు సొంతమైపోతాయి. ఒక్కొక్కప్పుడు ఒక భాషలోని పదాలు కూడా మరో భాషలో స్థిరత్వం ఏర్పరచుకుంటాయి. సొంత భాషలోని పదాలకన్నా పరాయి భాషలోని పదాలే వాడుకకు వొక్కొక్కప్పుడు చాలా బాగుంటాయి. 'ధూమశకట గమనాగమన నిర్దేశతామ్ర పట్టిక' లాంటి మాటలకు బదులు తేలిగ్గా రెక్క, సిగ్నల్ అంటే చాలా హాయిగా వుంటుంది. ఆ పదాలకుండే బలియతనుబట్టి మన ప్రమేయం లేకుండా అవే భాషలో చోటు చేసుకుని, స్థిరపడిపోతాయి. వివరంగా పరిశీలిస్తే ప్రతి భాషలోనూ పరాయిభాషా పదాలు కోకొల్లలుగా వుంటాయి. తెలుగు కూడా సంస్కృతం, తమిళ, కన్నడ, ఉర్దూ, హిందీ భాషలనుంచి చాలా పదాలు దత్తత తీసుకుంది.

## బుర్రకి పట్టాలంటే

మన పెద్దల, ఆ పెద్దల పెద్దలనాడు చోటుచేసుకున్న ఇంగ్లీషు ఇంకా మనలో కూడా కాస్త మిగిలి వుండడం వల్ల మన భాషలోకి ఇంత విజ్ఞానం తర్జుమా చేయగలమా అని మన కనిపించినా, యీ తాతముత్తాతలను మనం తరతరాల వారికి అందివ్వడం న్యాయంకాదు. ఆశయంగా పెట్టుకున్ననాడు విజ్ఞానబోధ తెలుగులో చేయడం కూడా సుసాధ్యం. అలా చేస్తే శాస్త్రవిజ్ఞానం ఎక్కువ మందికి బోధపడుతుంది కూడా. అసలు తెలిని విషయాలు తెలుసుకునే జిజ్ఞాస మానవునిలో వుండనే వుంది. ఎటొచ్చీ అది అతనికి అర్థమయ్యే భాషలో చెప్తే గమ్మున బుర్రకి పట్టుకుంటుంది.

శాస్త్రవిజ్ఞానం అభివృద్ధికాని దేశాలలో మానవుని పురోగతికి అడ్డొచ్చి మూఢనమ్మకాలు పిశాచాల్లా తిష్టవేసు కూర్చుంటాయి. మహాత్మ్యాలతో రోగాలు పోగొట్టడం, కునాలు, నరబలులమీద నమ్మకాలవంటి ఇంకా మనను వదలి పోకపోడాని కారణం సామాన్యమానవునికి శాస్త్రవిజ్ఞాన పురోగతి తెలికపోడమే. పనిమీద ఎక్కడకయినా వెళ్లేముందు పిల్లి, కట్టెలు, కిరసనాయిలూ వంటివి కనుపించినా, లేక ఎవరైనా తుమ్మినా, కాస్సేపుఆగి, కాళ్ళుకడుక్కుని మళ్ళ బయల్దేరడం మనలో యింకా వుండనే వుంది.

దేశంలో అక్షరాస్యత ఆట్టేలేని మాట నిజమే అయినా, ఇంగ్లీషుకన్నా తెలుగు



భారత్‌తో చర్చల నిమిత్తం శ్రీ ఇనాయత్ కరీమ్ నాయకత్వంలో ఎనిమిది సభ్యులు గల బంగ్లాదేశ్ ప్రతినిధివర్గం ఇటీవల న్యూఢిల్లీ వచ్చింది. శ్రీ టి. ఎన్. కౌల్ నాయకత్వంలో న్యూఢిల్లీలోని సౌత్ బ్లాక్‌లో వారితో చర్చలు జరుపుతున్న భారత ప్రతినిధి వర్గాన్ని చిత్రంలో చూడవచ్చు. (ఎడమ నించి మూడవవారు శ్రీ కౌల్, కుడివైపు రెండవవారు శ్రీ కరీమ్)

చదవడం, అర్థం చేసుకోడం వచ్చినవారి సంఖ్య కొన్నిరెట్లు ఎక్కువని ఒప్పుకు తీరాలి. తెలుగుభాష తెలుగువాడికి అర్థం కాదనీ, అది అతనికి చాలా కష్టమనీ అనలేముకదా! ఆశతాబ్దంలోనే గ్రంథస్థమై యింకా వాడుకలో వున్న భాషకదా మన తెలుగు భాష! కార్నెల్, విస్కాన్సిన్, టెక్సాస్, పెన్సిల్వేనియా, ఇల్లినాయిస్, యునైటెడ్‌స్టేట్స్ ఆఫ్ అమెరికా విశ్వవిద్యాలయాలలో తెలుగుభాషను బోధిస్తున్నారు. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు నియమించిన భాషా పరిశీలకులు యీనాడు పత్రికలలో వాడే శైలి చాలా దివ్యమైనదనీ, అది శాస్త్రబోధనకు కూడా చాలా అద్భుతంగా వుంటుందనీ తేల్చారు. దీనివల్ల తెలుగు వాడుకభాష శాస్త్రబోధనకు కూడా హాయిగా నప్పుతుందని సునాయాసంగా ఒప్పుకోవాలి.

**ఆపేక్ష**

తెలుగుమీద ఆపేక్షతోనూ, యీ ఆశయాలతోనూ పి. వేణుగోపాలరావు, డి. సత్యనారాయణ, పి. కృష్ణమూర్తి, ఆర్. సుబ్బారావుగార్లు సంపాదకవర్గంగా ఏర్పడి అమెరికాలో పై విషయాలను ఋజువు చేసేలా విజ్ఞానసంబంధ వ్యాసాలు, తదితర వ్యాసాలతో, కథలతో 'తెలుగు భాషాపత్రిక' అని పత్రికను (సైక్లోస్టయిల్డ్ పత్రికగా) ప్రచురిస్తున్నారు. ఎక్కడెక్కడో విదేశాలలో పెద్ద చదువులు చదువుకుంటున్న, వుద్యోగాలు చేస్తున్న తెలుగువారు యీ పత్రికకు తత్సంబంధమైన వ్యాసాలు, కథలూ, చందాలూ చక్కగా పంపుతున్నారు. కెనడియాలో బ్యాంక్ ఆఫ్ ఇండియా రెడ్ల శేషగిరిరావుగారీ పత్రికకు గౌరవ ప్రతినిధి.

అమెరికాలాంటి చోట వుంటూ కూడా భాషాభిమానంతో తెలుగును పట్టుకు వేళ్లాడ్డమేగాక, తెలుగు భాషలో విజ్ఞాన శాస్త్రాన్ని బోధపరచ గలమని నిరూపించ డానికి వీరు చేసే కృషి అమోఘము.

బెంగళూరు ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ తెలుగు సాంస్కృతిక సమితి తమ 'తెలుగుతోట' పత్రికను యీ తెలుగు భాషా పత్రికకు అనుబంధంగా నడపాలని నిర్ణయించు కున్నారట. శుభం భూయాత్.

—పాలాక్షుడు




కోడిగుడ్డు తినడంలో శాకాహార చర్యానికి భంగం రాదని కొంతమంది అంటారు. వెజిటేరియన్, నాన్ వెజిటేరియన్‌కి మధ్య ఎగ్‌టేరియన్ అని మూడో తెగకూడా ఏర్పరుస్తారు. పైగా గుడ్లలో శాకాహార గుడ్లుంటాయని కొంతమంది నమ్మకం' ఆశ. గుడ్డు శాకాహారం ఎలా అవగల్గుతుందో చూద్దాము.

కోడిపెట్ట గర్భంలో గుడ్డు మొదట పసుపువచ్చని భాగం మాత్రం గోళాకారంతో కలిగి ఉంటుంది. దానిమీద చందమామలాగా చిన్న చక్రం ఆకారంతో, తెల్లగా జీవపదార్థం ఉంటుంది. తరవాత ఈ గుడ్డు తల్లి గర్భంలో కిందికి (వెనక్కి) ప్రయాణించే తరుణంలో గుడ్డు బీజ సంయోగం చెందుతుంది. అంటే పురుషబీజం దీనితో కలుస్తుంది. కోళ్లు రెండూ సంపర్కం జరుపుకోవడంలో ఈ పురుష బీజాలు స్త్రీ శరీరంలోకి ప్రవేశిస్తాయి. ఈ బీజ సంయోగం తరవాత కోడిపిల్ల ఏర్పడడం ప్రారంభ మవుతుంది. కణాల విభజనతో అవయవాలు ఏర్పాటు జరుగుతుంది. ఏ దశలో ఉన్నా గుడ్డులో కోడిపిల్ల ఉన్నట్టే లెక్క. అది 'మాంసాహార' కోడిగుడ్డే. తరవాత తెల్లసొన పైన పెంకు అన్నీ ఏర్పడ్డాక కోడి ఆ గుడ్డును పెట్టడం జరుగుతుంది.

అప్పుడప్పుడు ఏదో పొరపాటుజరిగి, అసలు బీజసంయోగం జరగదు. అయినా మామూలుగా తెల్లసొన. పెంకు (కర్పరము) ఏర్పాటయి పోతాయి. కోడిపెట్ట మామూలుగానే గుడ్డు పెడుతుంది. కాని లోపల జీవపదార్థంలో 'జీవం' ఉండదు. ఇక దానిలో అభివృద్ధి జరగదు. కోడి తన పిల్లకోసం ఉంచిన ఆహారపదార్థాలే మిగులుతాయి. ఇక అది శాకాహార గుడ్డేకదా? మీరే చెప్పాలి.

# అమీన్‌దాదా అరాచకాలు

ఆశియన్లని బహిష్కరించడంద్వారా అమీన్‌దాదాగారి పేరు ప్రపంచ వ్యాప్తమై పోయింది. ఈ బహిష్కరణ ఉద్యమం మొదట ఇస్రయేలీ వారితో ఆరంభమైంది. ఇప్పుడు ఆశియన్లు, తర్వాత బ్రిటిష్‌ప్రజ అవుతారా ?

అసలు ఈ బహిష్కరణ ఉద్యమం ఎలా మొదలయిందీ అని ఆలోచిస్తే—ఆశియన్లకి సంబంధించిన ఒక నిజం బయట పడుతుంది,

అమిన్‌దాదాగారికి పెళ్లికావలసి వచ్చింది. ఒకమ్మాయిని వరించారు. ఆ అమ్మాయి ఈ దాదాగారితో పెళ్లికి ఒప్పుకోలేదు.

ఉగాండా
ఆసియనులు
బ్రిటిష్ 40,000
మొత్తం 80,000

ఆసియనులు
బ్రిటిష్ 55,000
మొత్తం 140,000

కెన్యా

టాంజానియా

ఆసియనులు
బ్రిటిష్ 20,000
మొత్తం 100,000

ఆసియనులు
బ్రిటిష్ 6,000
మొత్తం 12,000

ఆసియనులు
బ్రిటిష్ 6,000
మొత్తం 12,000

ఆసియనులు
బ్రిటిష్ 2,000
మొత్తం 10,000

ఆసియనులు
మొత్తం 614,000

0 కిమీ 300

NNS

ఉగాండానించి ఆశియన్‌ల బహిష్కరణ ప్రారంభంకాక పూర్వం ఉన్న అంకెలు

ఆయనగారి అహం దెబ్బతింది. కుటుంబ గౌరవం అంతా మంటగలిసి పోయినట్టుగా బాధపడిపోయారు. దీనికి ప్రతీకారచర్య తీసుకోవాలనుకున్నారు. వెంటనే ఆశియన్లని బహిష్కరిస్తూ ప్రకటన చేసేశారు. ఆయన ఆత్మ శాంతించింది!

తన దేశంలో అయితే సరిపోయింది, మరేదేశంలో అయినా — మహా అయితే ఒక సార్జెంటు అయివుండేవాడు అమీన్. ఈ సిపాయి జిత్తులమారి తనానికి ప్రసిద్ధి.

ఇప్పుడు ఈయన మేజర్ జనరల్. ఎల్లకాలం ఇలా అధికారంలో వుండాలని తపన.

ఇడీ అమీన్ ముస్లిం జాతిలోని 'కాక్వా' తెగకి చెందినవారు. ఉగాండా నైలునదీ తీరం ఇతని జన్మస్థలం. కురాన్ వీరికి నలుగురు పెళ్లాల్ని ప్రసాదించింది. ప్రజ లందరికీ తండ్రినవ్వాలని అమీన్ వాంఛ. ఆతనికి అయిదుగురు పెళ్లాలున్నారు. చిన్న భార్య నయిదియా కొద్ది నెలలుగా కనిపించడం లేదు!

కింగ్ ఫీజల్ తన భార్యలని ఎలా ఎన్నుకునేవాడో అమీన్‌గారుకూడా అలాగే ఎన్నుకుంటున్నారు. అమీన్ వెళ్లినచోటల్లా ఒక భార్యవుంది ప్రతి వూళ్లోనూ వుంది. అయి నా అతనికి సంతృప్తి అనేది లేదు.

అమీన్‌కి బాగా యిష్టమైన అమ్మాయి కంపాలాలోని ఒక సంపన్నమైన ఆశియన్ల కుటుంబానికి చెందిన కన్య. అతన్ని తృణీకరించింది. అమీన్ ఆమెని ప్రేమించలేదు. ఆమె అయిశ్వర్యాన్ని ప్రేమించాడు. తను అధికారంలో వుండడ నికి బాగా ఉపయోగించుకోవాలనుకున్నాడు,

కాని అతని కోరిక తీరలేదు. ఆ అమ్మాయి కుటుకబానికి చెందిన పెద్దలు ఆమెని ఆమీన్‌కి దూరంగా ఉగాండానుంచి పంపించేశారు. అప్పటినుంచీ ఆశియన్లమీద అమీన్ గారు విరుచుకు పడడం మొదలుపెట్టారు.

వాళ్లంతా 'డర్టీ పీపుల్' అని అమిన్ ఆగ్రహపడ్డారు. యూరోపియన్స్ ఆశియా

వాళ్ళకంటే మంచివాళ్ళట! ఉగాండా వృద్ధి లోకి రావాలంటే వాళ్ళవల్లే అవుతుందట— ఇది అమీన్‌గారి అభిప్రాయం.

అమీన్‌గారి బుర్రలో ఏదో రోగ పెడు తున్నట్టు భావించారు ప్రజలంతా. కాని, ఇలా ఆశియన్ల నందర్నీ బహిష్కరించడం వారికి షాక్‌లాగా తగిలింది.

అమీన్ ఈ బహిష్కరణ చర్యలో ఎవరినీ సంప్రదించలేదు. ఎవరితోనూ ఆలోచించ లేదు. జనరల్ ఈ నిర్ణయం తీసుకునే వరకూ అతనికే తెలియదు!

అమీన్ తప్పులు చేస్తూ వుంటాడుగాని, అతనేం తెలివితక్కువవాడు కాదు. తను చేసే తప్పులవల్ల ప్రయోజనమేంతో అతనికీ తెలుసు.

దేశం ఆర్థిక స్థోమతను పెంచడానికి ఈ నిర్ణయం తీసుకుంటున్నట్టు చెప్పారు. ఉగాండాలోని 39 జాతులవారూ నమ్మినట్టే వున్నారు. కాని, అలజడి ఆరంభ మయింది.

జాతి వైషమ్యాన్ని రెచ్చగొట్టడానికి అమీన్ పునాది వేశాడు. అతని ప్లాను ప్రకారమే అంతా జరిగింది. ప్రతి వాళ్ళూ ఆశియన్లను ద్వేషించడం ఆరంభించారు.

ఈ తంతంగమంతా తెరమరుగున వుండి జరిపిస్తూ నేరం ఎవరిమీదకు నెట్టుదామా? అని అమీన్ కాచుకు కూర్చున్నాడు. ఉగాండా ఆర్మీలో 16,000 మంది సైన్యం వుంది. వాళ్ళు తలుచుకుంటే అమీన్‌ని క్షణంలో దింపేస్తారు. వారిబలం తెలిసివున్న అమీన్ వారికి వ్యతిరేకంగా ఏమీ చెయ్యలేడు. ఈ పదవికి రావడానికి ఎంతో ప్రయత్నం చేశాడు. అంత తేలిగ్గా పదవిని వదులుకో దలచలేదు.

అమీన్ నాయకుడు కావడం అనేది అనుకోకుండా జరిగిన విషయం ఏమీ కాదు.

1965—66 లోనే అధికారాన్ని చెలాయించగల ముగ్గురిలో తనూ ఒకడు అని గ్రహించాడు అమీన్. తక్కిన ఇద్దరూ— మిల్టన్ అబోటే (అప్పటి ప్రధాని) రెండో వాడు షాబాన్ అపోలోటో (ఆర్మీకమాండర్)

మొట్టమొదట అమీన్ లయిజన్ ఆఫీసర్‌గా వున్నాడు. అందుకు ఒబోటే సాయంచేశాడు. ఆ విషయంలో చాలా డబ్బు కూడా సంపాదించ గలిగాడు. అంత డబ్బు అతనికెలా వచ్చిందీ అనే విషయంమీద ఒక 'కమిషన్'కూడా వేశారు. వాళ్ళకీ అంతు పట్టలేదు.

అప్పుడే అమీన్‌కి అనిపించింది. అందరి కంటే తనే తెలివయినవాడినని. అధికారంలో వుండాలంటే తనలాంటివాడే వుండాలి అనుకున్నాడు. అతను పథకం వేశాడు.

అన్ని జాతుల్లోనుంచి అతనికి భార్యలున్నారు. అతను అధికారంలోకి వచ్చిన రెండేళ్లలో 'లాంగి' జాతివారి దగ్గరకి వెళ్ళి— 'మిమ్మల్నీ నేను ఎలా ఇబ్బంది పెడతాను— నాకు మొదటగా పుట్టిన పిల్లవాడు మీ జాతి స్త్రీనుంచే కదా?' అన్నాడు. అలాగే 'అచోలి' జాతివాళ్ళతో అన్నాడు. మూడో కొడుకు అక్కడినుంచే వచ్చాడు!

అమీన్ 1928 లో పుట్టాడు. అతను పుట్టింది కాంగో బోర్డర్‌లో. 1946 లో ఆఫ్రికన్ రైఫిల్స్‌లో ప్రయివేట్‌గా చేరాడు. అతని ఎత్తు ఆరడుగుల మూడంగుళాలు. అప్పట్లో 16 స్టోన్ల (224 పౌన్లు) బరువు వుండేవాడు.

1951 నుంచి 1960 వరకు హెవీ వెయిట్ బాక్సింగ్ చాంపియన్‌గా వుండేవాడు. స్వాహిలి భాష నేర్చుకున్నాడు.

సార్జెంటు రేంకువరకు మామూలు పద్ధతిలోనే పైకి వచ్చాడు. 1959 లో మాత్రం కొత్తగా ఒక పోస్టుని 'ఎఫ్పెండి' అనే పేరుతో సృష్టించి—అందులో ఇతన్ని వుంచారు. స్వతంత్రానికిముందు ఆఫ్రికా ఆఫీసర్ల తరఫున పనిచెయ్యడానికి సృష్టించిన ఉద్యోగం ఇది.

1962 లో ఆఫ్రికాకి స్వతంత్రం వచ్చింది. అప్పుడు ఇద్దరు ఫుల్‌కమిషన్డ్ ఆఫీసర్లని ఉగాండా ఆర్మీలో వుంచాలను కున్నారు. చాలామందిని ఈ ఉద్యోగాలకోసం ఇంటర్వ్యూ చేశారు. అందులో అమీన్ కూడా వున్నాడు. కాని, షబన్ అపోలోటోని ఒక్కడుమాత్రమే సెలక్షన్ లిస్టులో వున్నాడు.

అతన్ని అప్పాయింట్ చేశారు. మరొకతని కోసం మళ్ళీ వేట ఆరంభమయింది, సెకండ్ లెఫ్టినెంట్‌గా ఇదీ అమీన్‌ని సూచించారు.

స్వతంత్రానికి ముందు ఒక 'ఆర్డర్'ని లక్ష్యపెట్టలేదు అమీన్. అపోలోటో గనక పట్టించుకోక పోయినట్టయితే అమీన్ కోర్ట్ మార్షల్‌కి గురికావలసి వచ్చేది. స్వతంత్రం వచ్చీరాగానే అపోలోటో, అమీన్—వీళ్ళిద్దరూ ప్రజలకి ప్రముఖంగా కనిపించారు.

ఆర్మీ కమాండర్‌గా వున్న అపోలోటో, అమీన్ ఇద్దరూ ఎప్పుడూ ద్వేషించుకుంటూ వుండేవారు. ఇద్దరు ఒకరిమీద ఒకరు చెప్పుకున్న చాడీలతో ఫైళ్ళు నిండిపోయాయి.

వాళ్ళిద్దరూ కలిసి పనిచెయ్యలేక పోయారు. తర్వాత, అప్పటి ప్రెసిడెంట్ ఒబోటె అపోలోటోని (1966 డిసంబర్‌లో) రక్షణ మంత్రిగా చేశారు. అమీన్‌కి కమాండర్ పదవి దక్కింది.

అపోలోటోకి అదే అంతిమస్థాయి. అపోలోటోని విషమపరిస్థితుల్లో పెట్టి అరెస్ట్ చెయ్యించాడు అమీన్. ఆ తర్వాతనే— 1970 దాటికి దాంతేసింది. (ఆ. సీ.)

**(ఇంకా ఉంది)**



ఇటీవల భోపాల్ ఆంధ్ర విజ్ఞాన సమితివారు ప్రదర్శించిన 'ప్రతాపరుద్రీయం' నాటకంలో పాల్గొన్న నటవర్గం: శ్రీయుతులు పి. నారాయణరావు, యస్. చిలువ్వేశ్వరావు, బి. నరసింహం, అంత కృష్ణమూర్తి, కె. పాండురంగరావు, కె. ఎస్. హరగోపాల్, పి. మోహనరావు, ఎం. భవానీశంకరం, ఎన్వీ చంద్రమౌళి, జి. వై. సోమయాజులు, డి. గోపాలరావు, సుబ్బారావు.

## రచయితలకు మనవి

### కథలు వ్యాసాలు.

ప్రచురణకి స్వీకరింపబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి స్టాంపులుమాత్రం పంపరాదు స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు వ్రాత ప్రతులతోగాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాత ప్రతుల తిప్పిపంపబడవు

ప్రచురణకు స్వీకరింపబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తరప్రత్యుత్తరాలు జరుపబడవు

### నవలలు

ప్రచురణకి స్వీకరింపబడని నవలల వ్రాత ప్రతులు మేమే తిప్పిపంపిస్తాము వ్రాత ప్రతులతో స్వంత చిరునామాకల, తగమాత్రం పోస్టేజ అతికించిన కవర్లు పంపనవసరం లేదు 100 అరఠావు పేజీల పయిన ఉన్న వ్రాతప్రతులే నవలల కింద పరిగణింప బడుతాయి.

### కార్టూన్‌లు

ప్రచురణకి స్వీకరింపబడని కార్టూన్‌ల తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి స్టాంపులు మాత్రం పంపరాదు

షరా: వ్రాతప్రతులనీ, కార్టూన్లనీ వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమయి ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్‌లు పంపగలరు.

సంపాదకుడు
ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# పుస్తకాలు

### మూడు నవలలు

(1) ప్రశాంతం – పేజీలు 184, (2) స్వాతంత్ర్య – పేజీల 174, (3) సంఘర్షణ – పేజీలు 196, రచయిత – సి నరసింహారావు, చైతన్య పబ్లికేషన్సు, ఏలూరురోడ్డు, విజయవాడ 2

(1) మోహన్ ఎమ్ ఏ, పాస్టైన సంతోషం చెల్లెలు మాలతి పక్కింటి అబ్బాయితో లేచిపోవటం ఇంటిల్లిపాదినీ కృంగదీస్తుంది రాధను ప్రేమించిన మోహన్, స్నేహితుడు 'విశ్వం' హితోపదేశానికి తలవంచి, మానేస్తాడు 'పెళ్ళిని' అతని భార్య రాజ్యం కూతురు అరుణ, కొడుకు కృష్ణ ప్రయివేటు కంపెనీ ఉద్యోగంలో వుంటూ — తన కిష్టమైన 'బుల్ బుల్'ని వాయించుకుంటూ ప్రశాంతంగా కాలాన్ని గడుపుతూ ఒకరోజున స్వంత వ్యాపారిగా మారి 'అక్షలు' గడిస్తాడు కొడుకు దుర్వ్యసనాల వలన — అప్పులపాలౌతాడు వ్యాపారంలో నష్టమొస్తుంది చదువుకోని తన తమ్ముడు వ్యవసాయంలో ప్రయోజకుడై, ఈ సమయానికి అన్నగారికి నెలభత్యం ఇవ్వగల స్థితికి ఎదిగిపోతాడు అతని కొడుకుల పెద్ద చదువుల్లో వుంటారు

మోహన్‌ని వెతుక్కుంటూ విశ్వం వస్తాడు అతని సహాయాన్ని నిరాకరిస్తాడు మోహన్ లేచిపోయిన చెల్లెలు కనిపిస్తుంది కూతురు సుఖంగా సంసారం చేసుకుంటూంది కొడుకు పనికిమాలినవాడవుతాడు ఎలక్షన్లలో యితని తరఫు పార్టీ వోడిపోతుంది ఇన్ని జరిగినా మోహన్, బుల్‌బుల్ మ్రోగించుకుంటూ కష్టసుఖాల్ని ప్రశాంతంగా స్వీకరిస్తాడు 'ఆఖర్లో — ఒక నిముషం కథ'లో రాజారావు — వెంకటరత్నంలు స్నేహితులు వెంకటరత్నాన్ని తనతో గడపటానికి రమ్మంటాడు రాజారావు ఒక్క నిముషంలో జవాబివ్వటానికి ఆలోచనలో పడతాడు వెంకటరత్నం

* * *

(2) అనూరాధ ఊహల ఉయ్యాల్లో ఊగుతూండేప్పుడే, సారధికి భార్య అవుతుంది చక్రపాణి లాంటి నిజాయితీ పరుడు ఈవిడ తమ్ముడు భర్త వెంట మురికిపేటలో కాపురముంటున్నా ఈవిడ ఆలోచనలలాగే వుంటాయి పక్కింటి మాధవమ్మతోనూ విద్యార్థిని సునందతోనూ స్నేహముంది భర్తతో పనిచేసే 'వేణు' మీద గౌరవం పెంచుకుంటుంది అతనొక రచయితని ఈవిడకి అభిమానం తానొక రచయిత్రి నవాలని కాంక్ష! సారధి సాటి ఉద్యోగిని 'కుసుమ' మీద అసభ్య ప్రచారం జరుగుతుంది వేణుకి దానిలో భాగమున్నది కుసుమ భర్త భ్యారకి ధైర్యం చెప్తాడు చక్రపాణికి శేఖరంగారమ్మాయి జానకికి పరిచయముయింది ఆమె పట్ల జాలి కలుగుతుందతనికి మాధవమ్మగారింట కూర్చుని మేస్తున్న స్వాములారు తప్పుచెయ్యబోయిన పట్టుబడిపోతాడు. . . . సారధి సహాయంతో పారిపోతాడు సారధికి బదిలీ అయిపోతుంది చక్రపాణి జానకి కోరిక ప్రకారం వెళ్ళిపోతాడు సునంద తండ్రి ఎలక్షన్లలో వోడిపోవడమేకాక, గెలిచినవారు చెయ్యబోయే మంచి పనుల్ని చెడగొట్టటానికి ప్రయత్నాలు చేస్తాడు

ఒక నిముషం కథ — సదావాగ సంపన్నుడు రామశాస్త్రి తలతాకట్టుపెట్టి కూతుర్ని కాపురానికి పంపాలన్నా చేతకాక పోతున్నప్పుడు 'పర్వతాలరావు' బయట కొరాసి, అవసరానికి రెండువేలు తీసుకో మళ్ళీకావాలన్నా ఇస్తాను' అంటాడు దానికి ఒక షరతు రామశాస్త్రి పూజా విగ్రహాల్ని బురదలో పారవేసెయ్యాలి(?) దానికి ఒక్క నిమిషం గడువిస్తాడు పర్వతాలరావు (?)

* * *

(3) శ్రీపతి ఎమ్ ఏ, మధ్యంతర ఎన్నికల్లో వోడిపోతాడు ఇతని అన్నగారు రంగారావు రంగనాయకి ( వేశ్య ) కోసం గడివాడలోనే వుంటాడు ఇతనికి అన్నీ శ్రీపతే సప్లయి చేస్తాడు చక్రపాణి రంగారావు కొడుకు పాపయ్య నేర్పిన విప్లవం' వంటబట్టినవాడు చలమయ్య మోతుబరి ఇంట్లో దొంగతనానికి వెళ్ళి పట్టుబడిపోతాడు శ్రీపతి భర్య అనసూయ, 'బియ్యే' ఈవిడ సుబ్బారావుతో స్వతంత్రించి సల్లాపాలు సాగించటం అతనికి చీమ కుట్టినట్లుగా వుంటుంది వో రోజు ఉదయం శ్రీపతి వెంటవచ్చిన రంగారావు, తన కుటుంబం ఎలా నవ్వులపాలౌతుందో గమనిస్తాడు తనని తన తమ్ముడ్నీ, చాటునుండి వెక్కిరించిన వారందర్నీ నయవంచనతో మెడలువంచి మళ్ళీ వెళ్ళిపోతాడు. తిరిగి కొంతకాలానికి వాళ్ళూరు వస్తాడు వూరితో కలిగిన మార్పునిచూసి, భరించలేక బావురుమంటాడు కూలికిపోయే ఆడవాళ్ళలో అనసూయ బియ్యే కూడ వుండటం అతనికి మరింత అసహ్యం కలుతుంది

ఒక నిముషం కథ — భుజంగరావుకి అన్నివిధాలా అడ్డుగావున్న రామారావుని — రూపుమాపటానికి, వీరిగాడు బయలుదేరేడు ఒక్క నిముషంలో అతని చేతికర్రతో రామారావు వేలకొరగాలి అంతమంచి వ్యక్తిని కొట్టటానికి ఆలోచిస్తాడు, వీరిగాడు —ఒక నిమిషం వ్యవధిలో!

— పై మూడు నవలలూ — కృష్ణాజిల్లా రచయితల సహకార సంఘానివి ఖరీదు 'ఐదేసి రూపాయలు' కొనుక్కొని చదివేందుకు — వీటిలో కొత్తదనం గాని కథా విధానంలో యింపుసొంపులుగాని కనబడవు సహకార సంఘానికి, రచనల్ని ఎంచుకోటానికి తీరిక లేదనుకోవచ్చు ఈ నవల్లో ఎలక్షన్ల విప్లవాలు పొలాల్లో జరిగే కొట్లాటలు ఎక్కువ. పతితలకి ఇంప్లైన కథావిధానం వ్యర్థం. ఈ సంఘం ముందు ముందు మంచి రచనలనందించగలరని ఆశించవచ్చు.

'కృష్ణ'

Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press 6 & 7 Thambu Chetty Street, Madras-1 and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3. Editor: S. Radhakrishna.



యు రోవిషన్ పాటల పోటీలో గెల పొందిన పాప్ గాయని వికీవిన్‌డ్రోస్ జర్మనీ, ఇటలీలలో స్వంత ఫ్లాట్‌లు ఉన్న ఈమె లండన్‌లో కూడా ఒక ఫ్లాట్ కొనాలని చూస్తున్నది

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.

# మామూలు రకం కాఫీలపై విప్లవం జరపండి !

## స్పెషల్ కాఫీ మాత్రమే కావాలని అడగండి

**ప్రత్యేక శక్తి నిస్తుంది**

ఇది చిక్కనైన సంతుష్టికరమైన కాఫీ. దక్షిణాదిలోని కాఫీప్రియుల రుచికి అనుగుణ్యంగా ప్రత్యేకంగా తయారుచేయబడినది.

**ప్రత్యేకమైన రంగు**

చిక్కనైన మంచి కాఫీకి అర్ధ చెంచా పొడి చాలు. మీ కప్పులో నల్లని ఎక్కువ సంతృప్తి నిచ్చే కాఫీ తయారవుతుంది.

**ప్రత్యేకమైన ప్యాకింగు**

తాజాగా సువాసన రుచిపోకుండా భద్రపరచటానికి మనదేశంలో రికరి ప్రప్రథమంగా ముందడుగు వేసింది. తేలికగా తెరవగల ప్లాస్టిక్ మూతతో లోపల "సేఫ్టీ సీలు వున్న" రికరి లభ్యమవుతుంది. నేడు లభించే సీసాలన్నిటికన్న ఆధునికమైనది.

ధర
రూ. 2.87
ఇతర పన్నులు
అదనం.

## కొత్తది! అధిక స్ట్రాంగ్

# రికరి®

## ఇన్‌స్టెంట్




**ఇది ప్రత్యేకమైనది! ఇది నెస్‌కాఫే వారు తయారు చేసినది**